# రుద్రమదేవి



## నాటకము.

గ్రంథకర్తలు:

నే. శ్రీ. కృష్ణమూర్తి.

ఇ. వేంకటరామయ్య.

" తొలిపలుకు "

న్యాయమూర్తులు

శ్రీయుతులు పా. వే. రాజమన్నారుగారు

శ్రీ వేంకటేశ్వరాయనమః

# మనవి.

---

ప్రాచీనాంధ్రచరిత్ర కథలయందుగల ప్రీతియే యీ రూపకరచనకు ముఖ్యకారణము. శ్రీ చిలుకూరివారి "చరిత్ర" ఈనాటకవస్తువునకు మూలాధారము.

ఇందువచ్చు ముఖ్యపాత్రములన్నియు చరిత్రాత్మకములే. నాటకమున వీర రసము ప్రధానముగను, శృంగార, అద్భుత, కరుణరసములు ఆనుషంగికములుగను కూర్పఁబడినవి.

నాటకముఖము:—

శ్రీ గణపతిదేవుఁడు తనకొమరితను పుత్రునిగాఁ బెంచి, పుత్రుడనియే లోకమునమ్మించి, ఆ "పుత్రికాపుత్రున" కు రాజ్యాభిషేక మొనర్చుటయేగాక వివాహముకూడ చేయును.

ప్రతిముఖము:—

ఆ పుత్రిక తండ్రిశాసనము నుల్లంఘింపనెఱిఁగియు, ప్రకృతిసిద్ధమగు యౌవనారంభమున ఉత్తమపురుషుని వలచును. ముమ్మడమ్మను జేర వెఱచును. మతముకొఱకై యుద్ధప్రచారము చేయుటకు ఇష్టపడదు.

గర్భము:—

ముమ్మడమ్మ సార్వభౌముని శరణొందుట, గణపతి దేవుఁడు ముమ్మడమ్మను దేశాంతరమునకు బాపదలచుట, యుద్ధము. రుద్రమదేవి కార్యపథకమును నిర్ణయించుకొనుట.

విమర్శ:—

రుద్రమదేవి ప్రతిజ్ఞ.

నిర్వహణము:—

ప్రతిజ్ఞానుసారముగ రుద్రమదేవి ముమ్మడమ్మ పుత్రుఁడగు బాలప్రతాపరుద్రునకు బట్టాభిషేకమొనర్చి ప్రస్థానము గావించును.

ఇది యీ నాటకవస్తువు నిర్మాణక్రమము.

కథానాయకుఁడు త్రైలింగసార్వభౌముఁడును, కాకతీయ వంశజుఁడునగు గణపతిదేవుఁడు. నాయిక రుద్రమదేవి. ఈ వస్తువున వీరు సంప్రదాయ విరుద్ధముగ తండ్రితనయులు.

* * * * *

ఈనాటకము వ్రాసినసంగతి తెలియఁగనే, మామిత్రులు శ్రీ చతుర్వేదుల సత్యగోపాలకృష్ణమూర్తిగారు, దానిని, వారి యింట, పండితసదస్యుల నాహ్వానించి, వారి రెండుమూలమూ చేబఠింప వసతి జేకూర్చిరి. వారికి మాకృతజ్ఞతాపూర్వక వందనములు,

ఈ నాటకమును, శ్రీ ఆంధ్రసభవారిచే ప్రదర్శింపజేసిన శ్రీ పులుగుండ్ల వేంకటకృష్ణయ్యగారికి మానమస్కృతులు.

శ్రీయుతులు రేబాల పట్టాభిరామిరెడ్డిగారు, మరుపూరు కోదండరామిరెడ్డిగారు, కాళహస్తి రామనాథముగారు, వీరల సాయమున ఈపుస్తకము ముద్రింపఁబడి, పాఠకమహాశయులకిఁ మేము అందఁజేయఁగలిగితిమి. వారందఱు మాకు వందనీయులు.

అభినవ తిక్కనేతి విఖ్యాతులు, సాహిత్యస్థాపక బిరుదాంకితులునగు శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు మాకెంతయో యుత్సాహము గలుగఁజేసిరి. గురుతుల్యులగు వారికి మా ప్రణామములు.

వాత్సల్యముతో, పాఠకులకు ఎఱుకపరుచుటకై "తొలిపలుకు" వ్రాసిన కళారసికశిఖామణి బిరుదాంకితులును, మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులునగు శ్రీ పా. వే. రాజమన్నారు గారికి మేము సర్వదా కృతజ్ఞులము.



నెల్లూరు
1-1-46

నేలనూతల శ్రీ. కృష్ణమూర్తి
ఇనుకొలను వేంకటరామయ్య.

ఈదృశ్యకావ్యము తే 31—1—43 దిన శ్రీ చతుర్వే దుల సత్యగోపాలకృష్ణమూర్తిగారి గృహమున పఠింపబడినది.

ఈరూపకము తే 4—7—1943 దిన నెల్లూరుజిల్లా జడ్జిగారైన శ్రీ W. W. జార్జిసన్ దొరవారి అభిమత పురస్సర ముగ, నెల్లూరు శ్రీ "ఆంధ్రసభ" వారిచే ప్రథమమునఁ బ్రదర్శిం పబడినది. ఈప్రదర్శనమున కీ॥ శే॥ శ్రీ నెల్లూరు నాగరాజ రావుగారు కథానాయక పాత్రమును, శ్రీమతి కె సుబ్రహ్మణ్య కుమారి నాయిక పాత్రమును నిపుణముగ నిర్వహించిరి. తే 18—6—45 & 5—2—46 దులలో ఈనాటకములో కొన్ని భాగములు మద్రాసు A. I. R. లో బ్రాడ్ కాస్టు కాబడినవి.

ఈనాటకము తే 8—9—1945 దిన, మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులగు శ్రీ పా. వే. రాజమన్నారుగారి అధ్యక్ష్యమున నెల్లూరులో "మూర్తుల" చే రెండవమారు ప్రదర్శిం పబడినది.

Note:— Permission of the authors is necessary for the production of this play.

# తొలి పలుకు

తెలుగులో చరిత్రాత్మకము లైన నాటకములు అనేక ములు లేవు. ఆంధ్రదేశచరిత్రకు సంబంధించినవి ఒకచేతివ్రేళ్ల కైనా సరిపోవేమో?

చరిత్రచర్వణంగా, ఏపురాణకథనో నాటకానికి ఆధారం గా చేసుకోక, మఱి కేవలకల్పనాకథను నాటకముగా అల్లక, కాకతీయసామ్రాజ్యచరిత్రలో నొక ప్రధానభాగాన్ని స్వంతకల్ప నలతో మిళితంచేసి ఈ "రుద్రమదేవి" నాటకము వ్రాసిన గ్రంథ కర్తలు ప్రశంసనీయులు.

ఇట్టి నాటకాన్ని విమర్శించుటకు ప్రమాణాలు, లక్ష ణాలు, దశరూపకములో వెతికి తేకవబడవు. వాటిని అనుసరించి వ్రాయబడినదికాదు గావున దీనిపోకడలు ఎక్కువగా ఇంగ్లీషు "క్రానికల్ ప్లేస్" (Chronicle Plays) "డ్రమాటిక్ బయాగ్ర ఫీస్" (Dramatic Biographies) ను పోలియున్నవి. ఆకారణ మున సహృదయులును, రసజ్ఞులు నైన పాఠకులును, ప్రేక్షకులును "ఈనాటకంలో నాయకుడు ఎవరు? నాయిక ఎవతె? నాయికా నాయకులు నాటకాంతంలో వివాహమాడతారా? అనేప్రశ్నలు అడుగుటసమంజసము కాదు.

సందర్భసన్ని వేశాలెట్లున్నవి? పాత్రపోషణ బాగున్నదా? భాష ఉచితమైనదా? శైలి సరళమేనా? మొత్తముమీద నాట

కము ఆకర్షణీయముగనున్నదా? ఇట్టి ప్రశ్నలు వేయుటే యుక్తము. ఇట్టి ప్రశ్నలు వేసి పరీక్షిస్తే నాటకకర్తలు తప్పక ఉత్తీర్ణులగుదురని నాయభిప్రాయము.

కథలో అసాధారణములైన అంశములు ఉన్నవి, నిజమే. ముఖ్యంగా రుద్రమదేవిని పురుషునిగా ప్రకటించుట. కాని, అట్టి వింతలు ప్రపంచములో సంభవింపకపోలేదు. స్వీడన్ చరిత్రలో "క్రిస్టినా" రాణి ఒక నిదర్శనము.

పురుషపాత్రలలో గణపతిదేవుడు, వీరభద్రేశ్వరుడు, స్త్రీ పాత్రలలో రుద్రమదేవి, ముమ్మడమ్మ చక్కగా చిత్రింపబడి యున్నారు. ముమ్మడమ్మ తీవ్రవాక్యాలు కటువుగావున్నవని నేనేమీ కొందలు. అంత అన్యాయముగా మోసగింపబడిన రాజకుమారి హృదయానలము మలయమారుతము వలె చల్లగనుండునా?

రుద్రమదేవి మహాత్యాగి. అయినా స్త్రీప్రకృతి లేని పాషాణహృదయురాలు. అందుచేతనే వీరభద్రేశ్వరుని ప్రేమించినది, గాని వివాహమాడలేదు.

మొత్తముమీద నాటకము రసవంతముగానున్నదనుట సందేహములేదు. అది చాలదా నాటకాభిమానులకు?

మదాసు
30–11–45

పా. వే. రాజమన్నారు.

శ్రీ సర్పగిరీశు పాదపద్మముల కంకితము

# కృతి సమర్పణము

శ్రీమంతంబగు శేషశైలముపయిన్ జెల్వొందఁ బద్మావతీ
శ్యామారత్నముఁగూడి భక్తజనరక్షౌఘధూర్వాహుండైన యా
శ్రీమద్వేంకటనాథు పాదముల కీదృశ్యప్రబంధమ్మును
ప్రేమోత్సాహముతోఁ గృతాంజలులమై యర్పింతు మే
మిద్ధ్యేడన్ ॥


కర్తలు
నేలనూతల శ్రీ కృష్ణమూర్తి
ఇరుకొలను వేంకటరామయ్య




# భరతముని ప్రార్థన.

తొలి సురపాళి వేడుకొనఁ దోయజగర్భుని యానకంబుచే
గలి నిగమంబులన్ జదువఁ గర్హితులౌ మనుజాళికెల్ల ని
చ్చలు సుగమంబుగా నిగమసారముఁ గ్రోలిక నాట్యవేదముం
జలిపిన దేశికున్ భరతసంయమిచంద్రునిఁ బ్రస్తుతించెదన్.

భావమును రాగతాళము భావగతియు
శ్రుతి విలోచన మానవ స్తోత్ర మోహ
కృద్వినూత్న కళాసృష్టికిన్ విధాత
యైన భరత భట్టారకు నభినుతింతు.

ఋగ్వేదమునఁ బాఠ్యగతి గ్రహించి
సామంబుచే రాగసరణిఁ దెలిసి
ఆంగిక వాచికాహార్య సాత్త్విక నాట్య
భంగిమంబుల యజుఃప్రాప్తి నేర్చి
రస మథర్వణమున రాఁదీసి యవ్వాని
నొండొంటి సమకూర్చి యుచితభంగిఁ
బరగ షట్త్రింశతి భాగంబులుగ నాట్య
శాస్త్రంబు రచియించి సర్వజగతి
వ్యాప్తి మొనరించు కొఱకునై స్వాత్మజులకు
శిష్యులకు నేర్పినట్టి విశిష్టకీర్తి
మూర్తి సద్గురువర్య! నా మ్రొక్కుఁ గొనుము
మహిత గుణసాంద్ర భరత సన్మౌనిచంద్ర.




# రుద్రమదేవి

## అంకము ౧ : రంగము ౧



ఓరుగల్లు నగరమున రాజవీథి : ప్రాతః కాలము

[శివ ప్రార్థనా రూపక మగు గానము వినబడు చుండును]

పాట - భూపాళి - ఝంపె.

జయతు జై నీలగళా - జయతు జై నిటలాక్ష
జయతు జై నటరాజ — జయ శంభో
జయ వీరభద్రేశా
జయ కాల కాలేశా
జయ చంద్ర శేఖర
జయ మహాదేవ ॥జయతు॥

2. బిలహరి

శరణమిడ నీవెగా - శరణార్థులను బ్రోవ
పతితదోషాకరు - కభయమొసగిన ఘనా
పతిత పావనశివా - పాహి పాహి పాహి. ||జ||

3. మోహన

అమృత మంథనజనిత - హాలహాలము హరింప
కంఠ సీమనుంచితే - కాలకాలా
సురసఖా సురహార - సుశరీర నీలగళా
దేవాదిదేవ ప్రభో - సదాశివా శంభో. ||జ||

4. ఆనందభైరవి.

కాయజుడు నీచేత - మోహింపఁ జేయ వెంచి
గర్వ భంగంబొందడే,
ఆర్తయగు రతిసతికి - పతిభిక్ష నిడలేదా
ఆర్త రక్షకశివా - హారతిదె గైకొనుమిగా
లోకేశ మాంపాహి మాం శివా. ||జ||

5. మధ్యమావతి

దక్షుడు నినుపేక్షింప - ధ్వంసంబుగావించి
దాక్షాయణి సుమసతిని - గ్రహింప లేదాశివ
అర్ధ నారీశ్వరుఁడవే - కృపాళూ
నీరాంజనం బిదియె - నిఖిలలోకాతీత
గంగాధరా హర-మాంపాహి మాంపాహి మాంపాహి
||జయతుజై||

[ప్రవేశము - వీరభద్రేశ్వరుఁడు, కాశ్మీరదేశీయ నేపథ్యమున]

వీరభ:—ఆహా! ఈనగర నిర్మాణ విధానము!

* సప్త పాతాళవిష్టప మహాప్రస్థాన
ఘంటాపథం బైన ఘనసుపరిఖ
తారకామండల స్తబకావతంసమై
కనుచూపుఁ గొనని ప్రాకార రేఖ
పుంజీభవించిన భువనగోళము భంగి
సరకు లాంగణంబైన వంకదార
మెఱుఁగు ఱెక్కలతోడి మేరుశైలముఁ బోలు
పెనుపైడి తలుపుల పెద్దగవను
శకట ఘోటక గజ రథ జనవితాన
సంకులములౌచుఁ దనరు విశాలరథ్య
లలరఁ గనుపండువౌచు రుద్రావనీశ
నిర్మితం బిమ్మహాపురి నెగడు నౌర!

బాలభానుని యరుణకిరణ ప్రసార మీమహానగరలక్ష్మి కనిర్వచనీయ శోభముఁ గలిగించుచున్నది.

†ఓరుగంటి పురంబు సౌధములపై నొప్పారు జ్యోత్స్నంబులై
యీరెడల్ మణిహేమకుంభములతో నేకాంతముల్ సేయుచున్

---

* † క్రీడాభిరామము నుండి.

స్వారాజ్యప్రమదాఘనస్తన భరస్థానంబులం బ్రాసి కా
శ్మీరక్షోదము ప్రాణవల్లభ దృఢాశ్లేషంబులన్ రాలెనాన్.

అదిగో! గ్రామదేవత మాహురమ్మగుడి. మహాప్రభావ యీదేవి-

* అలిగి యొంటరిరాజు నాండ్రైననుబట్టి
పుట్టుఁబాపలఁ జేయుకట్టుకత్తె
ఘనుఁడైన జమదగ్నిమునినాథు కూరిమి
వెలయించు బెరుబాక వేశ్యకత్తె
సుక్షత్త్రియకులంబు నిక్షత్త్రముగఁ జేయు
కొడుకుఁగాంచిన యట్టి కోపకత్తె
బవినీల జననికపాటల నిల్లాండ్రి
రమణఁదమల్లాడించు రంతుకత్తె
యొాలినిఁగన్నుళ్ళవాగుల్లో నోలలాడు
కలికి; పల్లికదేబెలఁ గన్నతల్లి
వాసికెక్కినయట్టి విలాసముల్లు
చక్కమొక్కుల మాహురమ్మక్కనాచి.

[ప్రవేశము: వీధిపాటకుఁడు - పాడుచు]

పాట

నాటకసూత్రముల్ కనరాజీవా! ప్రకృతిపెంపును తెలియర
గోప్యము,

* క్రీడాభిరామము నుండి.

తనువు వయసులయనుదినవృద్ధిచే కాలమెగతమై వికసితమయ్యెను
నిర్గమకాలపుఋతువనుయయుముగో స్వాతిస్సిద్ధంబౌ వాంఛలఫలము
అనుభవహేతువౌ యిచ్ఛాకలిగ ……… నాటకసూత్రముక్॥

[సామాన్యఆశ్వికవేషమున రుద్రమరాజు ప్రవేశించి పరిశీలనా దృష్టితోఁ గాశ్మీరునిజూచుచు నిష్క్రమించును. కాశ్మీరుఁడును ఆశ్వికుని పరిశీలనాదృష్టితోఁ జూచుచు పాటనువినుచుండును.]

— తెర —



## అంకము 1 – రంగము 2

ఓరుగల్లు నగరపరిసరారణ్య పర్వతప్రదేశము.

[ప్రవేశము—ధనుర్ధరుఁడై వీరభద్రేశ్వరుఁడు కాశ్మీరుని వేషమున ఆలోచనతో]

వీరభ: — ఆహా! ఇచ్చటనుండి చూచినపుడీయోరుఁగల్లుపుర మెంత దర్శనీయముగ నున్నది!

♦ పుష్పకనివహంబు భూమిపై నిలిచిన
యట్లందమైన దేవాలయములు
రూపాప్యచలము బహురూపంబుల నటించు
రమణ శోభిల్లు సౌధములపెల్లు,
అలకాధిపతి నిధులన్నియు వెలిపోట
విడిన క్రియం బణ్యావీథికలును,
ధాత మేదిని, మిన్నుఁదఱిగి వైచినమాడ్కి
గనుపట్టు బహుతటాకముల సొంపు,
నుపవనంబులు, సరసులు, నొప్పుచేయు
చెఱకుఁదోఁటలుఁ, బ్రాసంగుచేలు మెఱయ
నఖిలవిభవంబులకు నెలవగుచు వెలయు
నీపురంబున కెనపోని యింద్రపురము.

[ఒకలేడి పరుగున వచ్చుచుండును. వీరభద్రేశ్వరుఁడు విల్లెక్కిడి, బాణము విడువనుండ, ఇంతలో ధనుర్ధరుఁడై రుద్రమరాజు ఆశ్వికుని వేషమున ప్రవేశించి]

ఆశ్వికు:— ఎవఁడవునీవు? క్షత్రియుఁడవు కావా?

వీరభ:— [ఉలికిపడి, ఎక్కుడించి, తిరిగిచూచి, స్వగతము] విన్నటి
యాశ్వికుఁడే! [విసుగుతో, ప్రకాశము] పౌరుషోచిత
క్రియాచరణభంగకారివి నీవు పురుషుఁడవౌదువా?

ఆశ్వికు:— [ఇంచుక కోపముతో] ఏమీ!

---

♦ కేయూరబాహుచరిత్రము నుండి.

వీరభ:— [నిర్లక్ష్యముగా] వెఱపించుచున్నావా?

ఆశ్వికు:— [కోపముతో] ధర్మవిరోధముఁ జేయుటగాక ......

వీరభ:— ధర్మమేమి? విరోధ మేమి?

ఆశ్వికు:— మృగయాధర్మవిరుద్ధముగ నేను వెంటాడుచున్న లేడి నేలవధింపనుంటివి? ఇది చాల నపచారము.

వీరభ:— పరుగిడుచున్న కురంగముపై బాణము విడువఁబోయి తిని. మీరు వెంటాడు టెఱుఁగను. ఇదియే యప చారమా?

ఆశ్వికు:— [స్వగతము] ముఖము తేజోవిలసితము; మూర్తి గభీ రము. [ప్రకాశము చిరునవ్వుతో] అయ్యా! ప్రమాద ము లేదు. ఉబుసుపోకకై యుటఁబ్రవేశించి, లేడినిఁ జూచి, వెంటఁబడితిని. అది తెలియక మీపౌరుషము నాసారంగముపై జూపనుంటిరి.

వీరభ:— నగరవాసులెల్లఁ బట్టాభిషేకసంరంభమున మునిఁగి యుండ నుబుసుపోకకై యిట్లు వచ్చితి మను చున్నారే? మీ రిచ్చటివారు కారా?

ఆశ్వికు:— మేమిచ్చటివారమే! శ్రీగణపతిదేవసార్వభౌముని యాశ్వికసైన్యమునకుఁ జేరినవారము — మఱి, పట్టా భిషేకమునకు వచ్చిన సామంతరాజులలో మీరెవ్వరును లేరా?

వీరభ:— లేకేమి! గంగయదేవ, సారంగపాణిదేవప్రభృతులు ఒకప్పుడు మంచివేటకులే!

ఆశ్విక:— [నవ్వుచు] ఇప్పుడు కారు గాబోలు!

వీరభ:— నాభావమదికాదు; వయసు గడచినవారని మాత్రమే!

ఆశ్విక:— ఇకఁ బ్రాయఁపువారు?

వీరభ:— లేకపోలేదు.

ఆశ్విక:— ఎవరు?

వీరభ:— నిడుబ్రోలుమహారాజు.

ఆశ్విక:— అంతటివాఁడు కాఁడా!

వీరభ:— సముఖముననఁగదా ఆవిషయము తేలఁగలఁదు — సరి; మీరు సార్వభౌముని పరివారమునకుఁ జేరియుండియు, ఇట్టిసుభావసరమున వైముఖ్యము నొందుటయేల?

ఆశ్విక:— వైముఖ్యమేమియు లేదు కాని, నేఁడేలకో, యేమియుఁదోఁపక వెఱ్ఱియెత్తినట్లయ్యెను. అందుచే మనస్సు గుదురుపరచుకొనుటకై యిట్లువచ్చితిమి— వాలకము సామాన్యమైనను మీ రొకఘనతరవ్యక్తి యని నా యంతరాత్మ సూచింపుచున్నది. కావున నాసంశయ నివారణ మొనర్పఁ గోరుచున్నాను.

వీరభ:— మీప్రశ్నకుఁ దప్పక ప్రత్యుత్తర మీయవలసినదే! కాని ఈయొక్కప్రశ్నతో నన్ను విడిచిపెట్టిన ధన్యుఁడను. కాశ్మీరము మాదేశము. "ఉద్యోగం పురుష లక్షణమ్" అనుట వినరా! ఈసమయమున నేదేని

యుద్యోగము సంపాదించుకొను తలంపున వచ్చితిమి-
మీ ప్రశ్న మీకుంగూడ నన్వయించుచున్నదే?

ఆశ్వికుః— [చిరునగవుతో] ఇరువురము నొకయూహననే చరించితిమి. అగుంగాక. నిజము నిలుకడమీద నేర్పడును. సము లకుంగాక, సెయ్యము, వియ్యము, కయ్యము పొసంగవని పెద్ద లందురు.

— పాట —

సఖ్యతసాఫల్యంబిదిగో - సఖుండా సంతసమునగొనుమా
సార్థకమా మనయీచెలిమి - సుమలతవలె పెరుగ వలెగా ॥స
అమోఘంబై యలరునుగా - అమూల్యంబగు నాకాంక్ష
అపారంబగునుగాదే - అనురాగంబగు మనమైత్రి ॥స॥
మనసునగల సంకల్పంబు - మార్గంబది మంగళమిడును
అనుపమాన స్నేహబలిమి - అనవరతము శాశ్వతమగుగా ॥సఖ్య॥

మన యీ పృథమ పరిచయమునకుం గుఱుతుగా నాకరవాలమును మీకు బహూకరించుచున్నాను.

వీరభః— నేనును అట్లే. శీఘ్రముగం బునర్దర్శనము నభిలషించుచున్నాను. (కత్తులను మార్చుకొందురు.)

ఆశ్వికుః— సంతోషము. పట్టాభిషేకసమయమున రాజసభలో గలిసి కొందము.

వీరభః— అట్లే! (నిష్క్రమింతురు)

— తెర —

# అంకము 1 - రంగము 3

## ఓరుగంటిలో రాజ సభాభవనము.

[గణపతిదేవుఁడు సింహాసనమునకుఁ గుడివైపునఁ బీఠమున నాసీనుఁడై యుండును. కుడిపార్శ్వమునఁ గ్రమముగ రుద్రమదేవుడు (18 సం.), విశ్వేశ్వరశంభువు, శివదేవయ్య, గన్నయామాత్యుఁడు, సోమయామాత్యుఁడు నాసీనులై యుందురు. ఎడమ పార్శ్వమునఁ గ్రమముగ, గంగయదేవుఁడు, సారంగపాణిదేవుఁడు, గన్నయ్యరెడ్డి, వీరభద్రేశ్వరుఁడు నాసీనులై యుందురు. పేరినాయక ప్రభృతులగు పౌరులు కొందఱు ఎదురుగా నిలువఁబడియుందురు. ఇరువురు చామరగ్రాహిణులు వింజామరములు వేయుచుందురు. వందిమాగధులు, భటులు యథోచితముగ నిలిచియుందురు. నేపథ్యము నుండి శ్రావ్యమగు గానము వినిపించుచుండును]

వంది:— జయజయ పరమేశ్వర, పరమమాహేశ్వర, పరమభట్టారకా! త్రైలింగ్యరాజ్యభారధురంధురా! అనంతవిజయవాహినీపరివృతా! అఖండభూమండలేశ్వరా! రాజాధిరాజ, మహారాజ, రాజపరమేశ్వరా! శ్రీమన్మహామండలేశ్వర శ్రీకాకతీయగణపతిదేవసార్వభౌమా! విజయీభవ, విజయీభవ.

గణ:— మహాజనులారా! మూర్ధాభిషిక్తులగు మండలేశ్వరులారా! ఇంతకాలమునుండియు, నీమహాసామ్రాజ్యమును వైరిజనపరుప్రాపకముగ, జనరంజకముగ మేము పాలింపఁగలుగుటకు మహేశ్వరుని యనుగ్రహమే కారణముఁ

ప్రకృతము మేము జరాభారముచే నశక్తులమై పోయితిమి. అందుచే, మాయేకైకపుత్రుఁడు శ్రీరుద్రమదేవుని దక్షతముగుర్తించి మీయెల్లర సమక్షమున నాతనికి రాజ్యాభిషేక మొనరించి నయనపర్వముగఁ దిలకింపవలఁచితిమి. మాకుమారుఁడు రాజ్యమును శాసింపుచుండఁ బ్రశాంతహృదయులమై మహేశ్వరారాధనమున జీవితశేషమును గడుపనిశ్చయించుకొని, నేఁడీమహోత్సవమునఁ బెద్దలయనుమతితో జరుపఁబూనితిమి కావున సామ్రాజ్యశ్రేయోభిలాషులగు మీరెల్లరునుఁ దొల్లింటి భక్తివిశ్వాసములతో గ్రొత్తరాజుగారిని సేవింపఁగలరని యాశించుచున్నాము.

విశ్వే:— సభాసదులారా! పరమేశ్వర, పరమమాహేశ్వరఁ కుమారభట్టారక శ్రీరుద్రమదేవమహారాజుగారు సర్వవిధములఁ దమజనకులకన్న మిన్నలనుట యతిశయోక్తికాదు. పరమశైవులగు మీరెల్లరును మతరక్షణమునకును బ్రజాశాంతికిని వారికిఁదోడుపడుట కర్తవ్యము — శుభముహూర్తమాసన్నమైనది. అభిషేకక్రియాకలాపమును నిర్వర్తించెదను.

[మంత్రములతో, నొకబంగారుగిన్నెయందలి సుగంధతైలమును రుద్రమదేవుని శిరమునఁబూసి, పుణ్యోదకములచే మంగళస్నానముఁ జేయించును గణపతి, రుద్రమదేవుని సింహాసనాసీనునిఁజేసి, కిరీటము శిరమున నిడి తా.

దండము ఖడ్గము నొసంగును. రుద్రమదేవుండు లేచి వానిని గ్రహించి కూర్చుండును. గణపతి సింహాసనమునకు మ్రొక్కి లేచి తనపీఠమునఁ గూర్చుండును ]

వంది:— జయజయ పరమేశ్వర పరమమాహేశ్వర, కుమార భట్టారకా! ఆంధ్రమహాసామ్రాజ్య భారధురంధరా! అఖిల సామంతమండలేశ్వర కిరీటభ్రాజితోజ్జ్వల మాణిక్యనీరాజితపాదపీఠా! దేవబ్రాహ్మణ ప్రతిపాలకా! కాకతీయ వంశదుగ్ధపాథోధిశశాంకా! శ్రీమన్మహామండలేశ్వర శ్రీరుద్రమదేవమహారాజా! విజయీభవ, విజయీభవ:

విశ్వే:— రాజభక్తిప్రమాణముఁ గైకొను సమయ మాసన్నమైనది.

వంది:— శ్రీమన్మండలేశ్వర, రక్కసగంగ, మాండలిక బ్రహ్మరాక్షస, బాహత్తరినియోగాధిప, దూపాడువిషయాధీశ్వర, శ్రీశ్రీరాజమహారాజ గంగయదేవమహారాజా! జయీభవ, జయీభవ.

[గంగయదేవుండు సింహాసనమును సమీపించి, కరవాలమును చేతులయందడ్డముగా నిడుకొని, మ్రొక్కి, శిరమువంచి, లేచి, కత్తి నొగియందిడుకొని, వెనుదిరుగకయే తనపీఠముఁజేరి కూర్చుండును ]

వంది:— శ్రీమన్మండలేశ్వర, అతివిషమమహాయాయూథప్రౌఢరేఖారేవంత, పరబలకృతాంత, శరణాగతవజ్రపంజర, జీవరక్షచక్రనారాయణ, అద్దంకివిషయాధీశ్వర, మహారాజరాజశ్రీశ్రీ సారంగపాణిదేవమహారాజా! జయీభవ, జయీభవ

సార:— [గంగయు జీవుననుకరించును.]

వంది:— శ్రీమన్మాండలేశ్వర, సాహసోత్తుంగ, అరిగండభైరవ, వీరవితరణోత్సాహ, సౌజన్యగౌరవ, కాకతీయకటక సన్నాహ కడుపులూరు రాజ్యాధిప, శ్రీమన్మహారాజ రాజశ్రీ శ్రీగోనగన్నయ్యారెడ్డిరాజేంద్రా! జయీభవ, జయీభవ.

గన్న:— [పైవానిననుకరించును]

వంది:— శ్రీమన్మాండలేశ్వర, ధాత్రీభారధురంధర, మహారాజ భట్టారక, శతసహస్రధానుష్క సేనాపరివృత, చాళుక్య వంశశేఖర, నిడుబ్రోలువిషయాధీశ్వర శ్రీరాజమహా రాజశ్రీ వీరభద్రేశ్వరమహారాజా! జయీభవ, జయీ భవ.

వీర:— [పైవారిననుకరించును.]

[రుద్రమదేవవీరభద్రేశ్వరులు పరస్పరము విస్మయముతో జూచుకొందురు.]

వీర:— [లేచి] సార్వభౌమా! యువరాజభట్టారకా! గురుదేవా! ఈ త్రైలింగ్యాంధ్రమహాసామ్రాజ్య ముత్పన్నమైనది మొదలు, మాసామంతమండలేశ్వరుల భక్తివిశ్వాసములు అచంచలములై సామ్రాజ్యమునకుఁ బెట్టనికోటలైయు న్నవి శైవమతాభ్యుదయమునకును, సామ్రాజ్యసంరక్షణమునకును సహాయపడుటకు మే మెల్లప్పుడును సంసిద్ధులము పరమేశ్వరుఁడు నూతనసార్వభౌములకు శివ మొసఁగుఁగాక [కూర్చుండును]

పేరి:— మహాప్రభూ! నేము మానూతనసార్వభౌముల దర్శనమున మిగుల నానందము నొందఁగంటిమి మహేశ్వరుఁడు దేవరకు దీర్ఘాయురారోగ్యభాగ్యములఁ బ్రసాదించుఁగాత మని ప్రార్థించుచున్నారము

రుద్ర:— సామంతమండలేశ్వరులారా! పౌరమహాజనులారా! మీరు మాయెడఁబ్రకటించిన భక్తిగౌరవములు ప్రశంసనీయములు. మాజనకు లీమహాసామ్రాజ్యమును శాసించుటయం దనుసరించిన విధానములనే యనుసరించి, పాలితులకు సౌఖ్యముఁ గూర్చెదము. స్వాభిమాన, స్వార్థపరత్వములకు మాహృదయమునఁ దావొసఁగము. ప్రజాభిప్రాయానుగుణముగ రాజ్యతంత్రమును నడపెదము. మీభక్తివిశ్వాసములకు మమ్ముఁ బాత్రునిఁ జేయు మేథాశక్తులను మహేశ్వరుఁడు మాకుఁబ్రసాదించుఁగాత.

గణ:— ఈమహోత్సవసందర్భమున మఱియొక శుభోదంతమును మీకు శ్రుతపఱుపఁగలిగినందులకు సంతసించుచున్నారము సుప్రసిద్ధ సామంతప్రభువులునుఁ, గీర్తిశేషులు నగు కోటమహ్మండరాజుగారి తనయుఁడగు మహ్మెడమహ్మకును, మీనూతనసార్వభౌములకును వివాహము నిశ్చయింపఁబడినది రెండుమాసములలో నాశుభకార్యమునుఁగూడ వీక్షింపఁగలుగుదుము.

సామంతు
పౌరులు } శ్రీ రుద్రమదేవ సార్వభౌములకు జయము.

శివ: — [లేచి] ఇప్పటికి పట్టాభిషేకక్రియాకలాపము పూర్తియైనది. ఇక రాజసభ కూడుము.

[రుద్రమదేవాదులు లేచి నిలుతురు, పౌర, సామంతులు నిష్క్రమింతురు. రుద్రమదేవాదులు యథాస్థానముపవిష్టులగుదురు.]

ద్వారి: — [ప్రవేశించి] జయం ఏలినవారికి! ద్వారముకడ ఒక జైనగురువు ప్రభువుల దర్శనానికి వేచియున్నాడు.

విశ్వే: — ఆనాస్తికుని ముఖదర్శనము పాపహేతువు.

రుద్ర: — గురుదేవా! శాంతింపుడు. అతఁ డేలవచ్చెనో కనుగొందము. [ద్వారితో] ఓరీ! అతనినిఁ బ్రవేశపెట్టుము.

ద్వారి: — మహాప్రభువునాజ్ఞ. [నిష్క్రమించును]

విశ్వే: — మహారాజా! "నీతిసారము"నఁ దమపితామహులగు రుద్రదేవు లిట్లు ప్రబోధించి యున్నారు.—

* దండము లేకున్నఁ బ్రజ
లొండొరువుల నాక్రమింతు, రుచిత స్థితియై
నుండవు వర్ణాశ్రమములు
దండింపని భూమిపతికి ధర యేర్పడునే.

మఱియు —

† ఆజ్ఞలేని నృపుఁడు, నరయఁ జిత్తరువులో
నున్న రాజుఁజూడ నొక్కరూప,

* † నీతిసారము నుండి

యాసఁ ద్రోయు సుతునినైనను దండింప
కున్న రాజ్యమేలనూనుఁ జెడక.

రుద్ర:— పూజ్యులగువారే—

* ఆపదలందింకఁ బ్రజలను
భూపతి మొదలిచ్చి మనుపఁ బ్రోవఁగఁ జనుఁ దా
చేపట్టి విడువ నలవను
భూపతికిఁ గులాంగనగ భూమియు కాదే.

అనియు నుడివియున్నారు.

జైగురు:— [ప్రవేశించి] మహాప్రభూ! జినభగవానుఁడు మిమ్మాశీర్వదించుఁగాక.

విశ్వే:— చాలు నీ యాశీస్సులు. త్వరగ వచ్చినపని మనవి చేసికొని వెడలుము.

జై।గు:— చిత్తము దేవా! ........

రుద్ర:— భయపడవలదు. నీకార్యముఁ దెలుపుము.

జై।గు:— మహాప్రభూ! మతకక్షలవలన మాసంఘమునకు మిగుల నొత్తిడి కలుగుచున్నది. దండన లతి క్రూరములై, యపరాధములకు మించినవై యున్నవి. ఇక నిచ్చటఁ బ్రభువుల యనుగ్రహము తక్క మాకు వేఱురక్షణ లేదు.

* నీతిసాగరము నుండి

విశ్వే:— దేవా! వింటిరా! వీని ప్రల్లదములు! ప్రజలను వేదబాహ్యులఁగను, నధర్మపరులఁగను, భ్రష్టులఁగనుఁ జేయుచున్న వీరి యపరాధములకుఁ దగిన శిక్షయేమున్నది?

రుద్రి:— అయ్యా! ఇకమీఁద నట్టి యుపద్రవము లేమియుఁ గలుగవు. అన్ని మతములవారును స్వమతాచారములను స్వేచ్ఛగ ననుసరింపవచ్చును. కాని మతేతరసాంప్రదాయముల కేమాత్రమును భంగముఁ గలిగింపరాదు. మీఱి ప్రవర్తించినవారు కఠినశిక్షార్హులు. ఇది మా శాసనము.

జైగు:— రక్షితులము! దేవా! జినభగవానుఁడు మిమ్ము రక్షించుఁగాక — ఆజ్ఞ. [నిష్క్రమించును]

విశ్వే:— ఏమి నక్కవినయములురా! మీతుచ్ఛమతము పూర్ణముగ నశించుఁగాక

రుద్రి:— గురుదేవా! ఇంత క్రోధమేల?

గణప:— బిడ్డా! దేశికుల పలుకు లామోదార్హములు

విశ్వే:— వేదబాహ్యములగు నిట్టిదుర్మతములు సామ్రాజ్యమునకుఁగూడ విపత్కరములు. అందును, విప్రక్షమాకాంతులగు నీజైనులు ఏమాత్రమును క్షంతవ్యులు కారు.

ద్వారి: — [ప్రవేశించి] జయము ఏలినవారికి! దేవగిరి మండలే
శ్వరు లీశ్రీముఖాన్ని ఏలినవారికి పంపినారు. [జాబిచ్చును]

[శివదేవయ్య దాని నిట్లు చదువును.]

"శ్రీమన్మహామండలేశ్వరులును శ్రీకాకతీయమహాసా
మ్రాజ్యనూతన సార్వభౌములు నగు శ్రీరుద్రమదేవమహారాజు
గారికి, దేవగిరీశ్వరులును, యాదవాన్వయ ప్రసిద్ధులు నగు శ్రీ
అంబయదేవరాజు వ్రాయులేఖ. —

మీరు సార్వభౌములయ్యును, పక్షపాతము వహించి,
సర్వమత సమానసూత్రమును విస్మరించి, యన్యమతగురువులను,
దనుసారులను, అందును ముఖ్యముగా జైనమతావలంబులను,
మిగులఁ బాధించుచున్నారు. తన్మతానుసారులమగు మే మిట్టి
ప్రవర్తనమును తీవ్రముగ నిరసించుచున్నాము. మీసామ్రాజ్య
మునందలి ప్రజలే యైనను, జైనులను మీరు వెతలఁబెట్టుట
తన్మత ప్రాభవాభిలాషులమగు మ మ్మవమానించుటయే
యగును. ఇట్టిమతవైషమ్యములనుఁ గూర్చి శ్రీగణపతిదేవసార్వ
భౌములనుఁ గూడ పలుమారులు హెచ్చరించియుండియును, మీ
యుదాసీనతచే ప్రయోజనముఁ బడయమైతిమి. కావున మతరక్ష
ణార్థము కత్తిదూయ సంసిద్ధులమై మిమ్ము హెచ్చరించు
చున్నాము.

ఇట్లు,

యాదవ అంబయ దేవరాజు

దేవగిరీశ్వరుఁడు.

[రుద్రమదేవాదులు పరస్పరము ముఖములు చూచుకొందురు.]

విశ్వే:— మహాప్రభూ! చిత్తగించితిరా యీశూరమ్మన్యుని ప్రేలనములు!

రుద్ర: — ఇంతమాత్రమున మించిపోవునదేమి? మననిర్ణయము నతనికిఁ దెల్పుడము అతఁడు తప్పక సుముఖుఁడగును.

విశ్వే:— అట్లయిన, మనదౌర్బల్యమును గుర్తించి యతఁడు విజృంభింపఁగలఁడు.

రుద్ర:— అప్పుడు ప్రభువు నేర మాతనిదే యగును.........

పవిత్రమగు హిందూమతమే యీ భిన్నమతములకు మూలము. హైందవులమగు మనము మతద్వేషములతో కలహించుట, మతాంతరులగు యవనుల దండయాత్రలకు మంచియవకాశమగును· దేశ మరాజక మగును. నా పాలనమున సర్వమత సమానసూత్రము నాచరణమునకుఁ దెచ్చుటకు నా సర్వశక్తులు ధారవోసెదను· అటుపై మహేశ్వరుని యనుగ్రహము.

[నేపథ్యమున శంఖధ్వని]

వంది:—సార్వభౌములకు జయము. సభ లేవ సమయమైనది·

— తెర

## అంకము 1 - రంగము 4

ఓరుగల్లునగరమున నొక చతుష్పథము.

[జవనీలుపరశురాముని కథను పాడుచున్నారు. కొందరుజనులు వినుచుందురు]

తన తల్లిశోకంబు తనమదిలోన
వినవచ్చినట్లుగా వినుపంచియుంబు
దోచిన బలుశంకతోడ రాముండు
యోజనత్రో దాఁటికొయ్యనఁ జేరి
తనతండ్రిఁగనినంత, దనతల్లియేడ్పు
వినినంతఁ గన్నుల విస్ఫులింగములు
రాలఁగాఁ గ్రోధాగ్నిరవ్వులఁగా నిలిచె
రామునిఁగనినంత రమణి గొంతెత్తి
ఏమని తెలుపుదు నీవార్తఁ గొడుక
ఆమున హైహయులదయులై యడరి
ఈమహామునినాథు నిటుజంపినారు
నిఁనుబోలు కొడుకునుఁ గనియున్న నాకు
తనయ! వైధవ్యంబు తప్పకపోయె
అనిశిరమ్మును అమ్మ నతివ మోదుకొని
పనవిఁయిరువదియొక్కపర్యాయ మేడ్వ
పరశురాముఁడుఁ గ్రోధపరవశుఁడయ్యె
గిదులతో తొడని గిరగిరఁ దిరిగె

ఖరక రేందులు నిజగతులనుఁ దప్పె
చుక్కలు రాలెను దిక్కులు బగిలె
మిక్కుటమై మ్రోసె మింట గర్జనము
పరశువుపై చేయిపడియె రామునకు
భరమయ్యె ధర శేషఫణి కూర్మములకు
ముల్లోకములు భీతిల్లినా డె
ఉల్లోల కల్లోలము దధులుపొంగె
నిరువదియొకమారు లీ భూమిఁదిరిగి
విరివిగ రాజుల వెదకి చంపెదను
వారిరక్తమునఁ దర్పణముఁ గావింతు
పరగ నాతండ్రికని ప్రతినవహించె.

— తెర —



## అంకము 1 - రంగము 5

ఓరుగంటిలో వీరభద్రేశ్వరుని విడిదిఇల్లు.

[ఆలోచనాధీనుఁడై వీరభద్రేశ్వరుఁడు ఒంటరిగా]

**భటుడు:—** [ప్రవేశించి] దేవా! కాచనగరునుంచి ఒకయందమైన పెట్టెతో కొందఱు భటులు ద్వారంవద్ద వున్నారు.

వీరభ:— రానిమ్ము

భటుడు:— చిత్తము [నిష్క్రమించును]

[ఒక పెద్ద పెట్టెతో కొందఱు భటులు ప్రవేశింతురు]

వీరభ:— ఎవరురా మీరు?

భటులు:— [ఊరక నిలచి యుందురు]

వీరభ:— ఏమిరా పలుకరు? ఈపెట్టె యెక్కడిది?

భటులు:— [మాటాడక తలపైనున్న పెట్టెను తట్టిచూపెదరు]

వీరభ:— [స్వగతము] వీరుమూగవారాయేమి? వీరీపేటిక నెం దుండికొనివచ్చిరో [ప్రకాశము] ఏమిరా యీపేటిక తెనము? బదులు పలుకరేమి? [కొరడాను చేతఁగొనును]

భటులు:— [చెవిని దంతమిడుచు మాటల పెట్టెను తట్టి సైగఁజేసెదరు]

వీరభ:— [స్వగతము] సరి, వీరందఱును మూగవారే! ఇట్లేల జరిగినది! [పెట్టెలో నేమున్నదనుటగా సైగచేయును]

భటులు:— [ఒకచిన్న ఏకవీరవిగ్రహముఁ జూపి పెట్టెలో నీమెయున్న దని సైగతో దెలుపుదురు]

వీరభ:— [స్వగతము] ఇందేమో విశేషమున్నది. లేకున్న మూగ భటులు రానేల? [పెట్టెనుదించి పొమ్మని సైగచేయును. వా రట్లుచేసి ఏకవీరవిగ్రహమును పెట్టెపై నుంచి వెడలుదురు]

వీరభ:— ఔరా! ఎంతయందమైన మంజూష! ఇంతటి శిల్పకళా నైపుణ్య మదృష్టపూర్వము.— ఏకవీరవిగ్రహ మీపేటి కయం దున్నదనిగదా భటులు తెలిపిరి. అదెంతటిమూర్తి

యోచించెదను. [నెమ్మదిగా మాటనుఁ దెఱచును. అందుండి యవకుంఠనవతియగు స్త్రీవ్యక్తి వెడలును. వీరభద్రేశ్వరుఁడు వితా కుతో వెనుక కడుగువైచును. స్త్రీ, లజ్జాదరహాసములతో దలవంచి నిలుచును]

వీరభ:— [స్వగతము] ఎవరీమె! [ప్రకాశము] లతాంగీ! నీవెవ్వరవు? ఇచ్చటి కెట్లువచ్చితివి? ఏల?

స్త్రీ:— నేనా! ఇచ్చటి దాననే, కొంచెము పనియుండి వచ్చితిని. మీయాజ్ఞపై, మీయెదుట, మీభటుఁడేగదా రావించెను.

వీరభ:— ఇచ్చట నీ వెఱిఁగినవా రెవ్వరైన నున్నారా?

స్త్రీ:— కలరు. కనుకనే వచ్చితిని.

వీరభ:— ఎవరు?

స్త్రీ:— మీ కగుపడుటలేదా?

వీరభ:— నా కర్థము కాలేదు. ఎచ్చట?

స్త్రీ:— ఏమీ! నాయెదుటనే ప్రతిబింబించి యున్నారు.

వీరభ:— [వెఱఁగు పడి, వెనుకనున్న యద్దమునఁ దనప్రతిబింబమును, ప్రక్కను స్త్రీప్రతిబింబమునుఁ జూచి విస్మితుఁడై] నేనా! తరుణీ! నీమాటలు వింతగ నున్నవి.

స్త్రీ:— ఇంకను మీకర్థము గాలేదా?

వీరభ:— నీప్రవర్తనము చిత్రముగ నున్నది. నీ కిచ్చటఁ బని యేమి?

స్త్రీ:— నాకత్యంతప్రియతమమగు వస్తువు నిచ్చటివా రపహ రించుకొని వచ్చిరి. దానికొఱకు వచ్చితిని.

వీరభ:— ప్రమాదము! నాభటులలో నెవ్వరేని యట్టి దురంత మునకుఁ బాల్పడిరా?

స్త్రీ:— పాపము! భటు లెవ్వరునుఁ గారు.

వీరభ:— అయిన నిక నెవ్వరు?

స్త్రీ:— మీరే!

వీరభ:— మేమా! మ మ్మెవ్వరని తలచుచున్నావో?

స్త్రీ:— నిమబోలు మర్గాన్వేషకులగు మండలేశ్వర శ్రీవీరభ ద్రేశ్వర మహారాజుగారని. అయిననేమి?

వీరభ:— మే మపహరించిన నీవస్తు వేది?

స్త్రీ:— ఎట్టి యువిదయైనను దొంగిలించిన పురుషుని యెదుటఁ జెప్పుటకు వలనుపడని వస్తువు.

వీరభ:— ఇదియా విషయము! సరి సరి నా సందేహమే నిజ మైనది. కాని, సుదతీ! నవీనులకడ నీ విట్లు మెలఁగుట మిగుల లాఘవము.

స్త్రీ:— శూరాగ్రేసరా! మీరు నాకు నూతనులు కారని మొదటనే మనవి చేసితినే!

వీరభ:— నీప్రవర్తనము నీమాటలను విశ్వసనీయములుగఁ దోఁపనీయదు. నీవు...............

స్త్రీ:— [ఇంచుక నిరసనభావముతో] ఆర్యా! నేను మహాభిజాత్య

నగు కన్యను; దయయుంచి నీచభావమునకు మాత్రము మీామనఘునఁ దావీయకుఁడు.

వీరభ:— రమణీ! మమ్ముఁ గేవల విషయలోలునిఁగ నెంచితి వేమో. పొరఁబడితివి. ఇంత కంఠశోష యేల? నిక్కముగ నిన్ను నే మెఱుఁగము.

స్త్రీ:— మహాశయా! త్వరపడకుఁడు. నన్ను మీారెఱుఁగరా? నిక్కముగ నెఱుఁగరా?

వీరభ:— ఎఱుఁగను.

స్త్రీ:— మనపరిచయమును నిరూపించిన?

వీరభ:— అసాధ్యము.

స్త్రీ:— సాధ్యమే - సుసాధ్యము.

వీరభ:— నమ్మఁజాలను.

స్త్రీ:— నిరూపించినచో నామాటల నంగీకరింతురా?

వీరభ:— నిర్బంధమా!

స్త్రీ:— అవును. ఎఱింగియు లేదని దబ్బరలాడు మీా మాట నమ్ముటెట్లు?

వీరభ:— ఏమీా! న న్ననృతవాది యనుచుంటివా?

స్త్రీ:— అవును

వీరభ:— నీమాటలు మమ్ముఁ గలవర పఱచుచున్నవి ఇచ్చటి స్త్రీలలో నెవరితోడను మాకుఁ బరిచయము లేదు. మఱి నీ పలుకు లిట్లున్నవి. మమ్ముఁ జాల సందిగ్ధ ... పాల్ప

డఁ జేయుచున్నావు. కానిమ్ము. ఏదీ! నిరూపించెద
నంటివే! చూతము.

స్త్రీ:— నామాట నంగీకరించెదరా!

వీరభ:— విధిలేదు.

స్త్రీ:— అట్లయిన నీ కరవాల మెవరిదో తిలకింపుఁడు.

[కత్తినిచ్చును]

వీరభ:— ఇది నాయదియే. నీ కెట్లు దొరకెను?

స్త్రీ:— మీ కొసఁగకయే మీ కృపాణ మితరులఁ జేరునెట్లు?

వీరభ:— నిజమే; కాని, ఇది నీకడఁ జేరుటకుఁ గారణము
మాత్రము తెలియకున్నది. ఈసంఘటనము దురూహ్యము. ఒకమిత్రు
నకు దీనిని బహూకరించి యుంటిని.

స్త్రీ:— ఎవ రామిత్రుఁడు.— ఏ మాలోచించెదరు? మీ
మిత్రుఁ డంత రహస్యవ్యక్తియా?

వీరభ:— శ్రీరుద్రదేవ మహారాజు.

స్త్రీ:— మిత్రబహూకృతమగు వస్తువును మహారాజితరుల
కొసఁగు నను సంశయ మేమైన నున్నదా?

వీరభ:— సుహృద్భావచిహ్నముగ నొసఁగఁబడిన వస్తువల్పమే
యయ్యును, నమూల్యమే: అట్టిదానినిఁ బరుల కొసగుఁ
నంతటి నిరాదరభావము మహారాజునకుఁ గలుఁగదనియే
నా నమ్మిక. మఱి పరికృత మనూహ్యము.

స్త్రీ:— అనాహార్యమే మున్నది? రుద్రమదేవమహారాజునకు మీ రీఖడ్గము నొసఁగితిరి. దాని నతఁడు విడనాడఁడని మీకు నమ్మక మున్నది. ఆకరవాలమే నేను మీ కిపుడిచ్చితిని.

వీరభ:— ఏమీ! మీరిరువురు నభేదవ్యక్తులా?

స్త్రీ:— ఏల కాఁగూడదు?

వీరభ:— ఇదేమో తలఁపున కందరాని విషయము

స్త్రీ:— ఇంత యచ్చెరు వొందనేల? కాశ్మీరదేశీయుఁడగు నొక పాంథుఁడు నిడుబ్రోలు దుర్గాధీశ్వరుఁ డగుట సంభవించినప్పుడు... ...

వీరభ:— సామాన్యుఁడగు నాశ్వికుఁడే రుద్రమదేవ మహారాజును, అతఁడే ప్రచ్ఛన్నరూపమున రుద్రమదేవియు నేల కాఁగూడదనియా?

స్త్రీ:— మహాశయా! సర్వవిషయములును మాకుఁ జారచక్షువుల వలనఁ దెలియఁగలవు. ఇకఁ దాపనేల? అదియే యిందలి రహస్యము.

[ముసుఁగుఁదొలగించును]

వీరభ:— [స్వగతము] ఆహా! కన్నుల కలిమి సార్థకమైనది. [ప్రకాశము] మహారాజ్ఞీ! ఈయద్భుతసంఘటనము చే నాబుద్ధి జడప్రాయమై పోయినది.

స్త్రీ:
రుద్రమదేవి } వీరభ ద్రా! సమ్ముఖమున రాయబారమేల! ఈరుద్రమదేవియే నేటివఱకు రుద్రమరాజుగా వ్యవహారింపఁబడుచుండినది. ఇదియే పరమనిగూఢమగు మావంశ రహస్యము. మన ప్రథమ సమావేశమే నాహృదయమును భావంక కీడ్చినది. ఇంతవఱకు నిట్టులో స్థైర్యమూనియుంటిని. హృదయావేగమును నిలుపఁజాలక, విధాంతరము తోపమి, నిట్టి సాహస మొనర్చితిని.

వీరభ:— ఆహా! మహదేవీ! నేనెట్టి యద్భుతోదంతముఁ దెలిసికొంటిని! కాకతీయసామ్రాజ్యమునకుఁ జక్రవర్తినివగు నీవు సామంతమండలేశ్వరుఁడ నగు నాయందిట్టి యనుగ్రహముఁ జూపుట, యదృష్టదేవత నాయెడఁ బ్రసన్న యగుటయే!

♦ "లలితవసంత విలాసోదయమ్ముతో
రాగిల్లెనాఁడు నీప్రణయవల్లి
చకితసారంగ వీక్షణముతో లేడికై
పోరాడెనాఁడు నీపౌరుషమ్ము
దర్బారులోని సర్దారులో నలనాఁడు
ప్రియుని గుర్తించె నీప్రేమదృష్టి
మోహన స్త్రీరూపమును దాచె నిప్పటి
వఱకు నీ చతురనేపథ్యరీతి

♦ సరసకవి

బాపురే! గుప్తగాథానుబంధ పారి
జాత పుష్పమ్ము వికసించి సౌరభమ్ముఁ
జిమ్మె నా మీఁద సత్యమ్మునుమ్మ; సాకుఁ
గోరఁదగినది లే దింక కీరవాణి"

రుద్రమ:— ధన్యురాలను; ప్రాణేశ్వరా! ధన్యురాలను.

పాట- శ్యామరాగము- ఆదితాళము.

ధన్యతఁజెందితిని - నాథా ॥ధన్యత
సార్థకమయ్యెను - జీవితభాగ్యము
సమయ మిదేప్రియ - సంతసమొదవగ ॥ధన్యత॥
రాగవతీహృద - యాభిరతీ - యిటు
అనుకూలించెను - ఆనందముగా
ప్రణయకల్యాణి - గాంధర్వంబిదె - నాథా
ప్రణుతింతుఁ మది - వీరవరేణ్యా ॥ధన్యత॥

వీరభ:— దేవీ! నీప్రణయపాత్రుఁడనైన నా కీ ప్రపంచముతో బనిలేదు. కాని నేనిచటనే నిలిచినచో, రహస్య ముద్ఘాటిత మగునేని, మనకు యశోహానియు, రాజకీయోద్యోగులలో నసంతృప్తియుఁ గలుగఁ గలవు కావున యథావిధిగ వివాహితులమగుట సమంజసము.

రుద్రమ:— నిజమే! అయినను, కొన్ని కారణములచే నింకనుఁ జాలకాల మీ పురుష నేపథ్యముతోడనే నేను ప్రవర్తింప

వలసి యున్నది. సౌభాగ్యవశమున మనపరిణయము యథావిధిగ జరుగఁగలదు. అంతవఱకును మీసాన్నిధ్యము దూరమగునేని, నేను నాపనులను క్రమముగ నిర్వర్తింపఁజాలను. గాంధర్వవివాహము రాజులకుఁ బ్రశస్తమును, ముఖ్యము నగును గదా!

వీరభ:— దేవీ! అగుఁగాక, మన కెడబాటు లేకుండ నొకయుపాయముఁ బన్నుదము. తొలుత నేను నిడుబ్రోలున కరిగినట్లు నటింతును. మనుపటి కాశ్మీరదేశీయుని వలెనే సార్వభౌముని యంగరక్షకాధికారినై నీవెంటఁ బాయక యుందును. సమయమెఱిఁగి, కలహాపు వెలువరించి, తగినట్లు ప్రవర్తింతము.

రుద్రమ:— ఆయుద్యోగమా!

వీరభ:— అవును. లేనిచో మనకు నిరంతరసాన్నిధ్యము దుర్లభమగును. కావున యంగరక్షకాధిపత్యమే యుచితము.

రుద్రమ:— సరియే! మఱి నే నిటనుండి వెడలుటెట్లు?

వీరభ:— మంజూషాంతర్గతవై వచ్చిన నీవు, రత్నకంబళాచ్ఛాదితవై నగరుఁ జేరలేకపోదువా? దేవీ! స్త్రీలకు సాహసమాఱుమడుఁగులన్న నీతివాక్యము నేఁ డన్వర్థమైనది సుమా!

రుద్రమ:— ప్రేమప్రభావము!

† దూతము వ్యవసాయకులకు
భారంబు సద్గుణులకును, భాసురవిద్యా
పారగులకును విదేశము
వైరము ప్రియవాదులకును వసుమతిఁ గలదే॥

వీరభ:— దేవి!

* కొందఱి మేలమాడుటలుఁ గొందఱి వావులు దేర్చి పిల్చుటల్
కొందఱి ముద్దుసేయుటయుఁ గొందఱి నెయ్యపుఁజూపు
సూచుటల్
కొందఱినాత్మభావమునఁ గొందఱి మన్నన, భృత్యులందు ని
ట్లాద అనన్ని భంగుల నృపాగ్రణి వశ్యులఁ జేయఁగా దగున్

లోని కరుగుదము. భటుల నాజ్ఞాపించివత్తును.

[వెళ్లెదను మూయుదును. రుద్రమదేవి వలదని సూచించుచు వీరభద్రేశ్వరుని నిలుపును ఇరువురు ఏకాంతమున నుందురు.]

— తెర —

† * నీతిసారము.





## అంకము 2  రంగము 1

ఓరుగంటిలో అంతఃపురోద్యానము.

[ముత్యాలు అను పరిచారిక సన్నగొంతుకతో పాడుచు పూలుకోయుచుండును.]

ముత్యా:— [దూరమునం జూచి,] ఎవరా పొయ్యే మనిషి! గౌరిలా గుందే! ఒసే! గౌరీ! గౌరీ!

గౌరి:— [తొందరగా బ్రవేశించి] ఏమే ముత్యాలూ! బాగున్నావుటే!

ముత్యా:— అబ్బో! నీకెంత నాయికం వొచ్చిందే! గొంతు పగిలిపొయ్యేట్టుగా అరిచినా యిష్టం లేదుగదే!

గౌరి:— అవునమ్మా! మహారాజుగారి సన్నిధిలో నేనెప్పుడూ వుండేదాన్ని, అంతఃపురంలో వుండే దాసీల కందఱికి పెద్దను, గనక నాకు గర్వంపట్టింది!

ముత్యా:— ఒసే! నన్ను దెప్పుతున్నావుటే! అవునులే! నీమాదిరి మేము మహారాణీగారి అభిమానం పొందిన వాళ్లమై తేగదూ!

గౌరి:— మరి వూరికే నా యికనుంచీ యెట్లావుంటుంది చెప్పు!

ముత్యా:— ఎగతాళికంటే యింత వుసుకుతా వెందుకే! పోనీ గాని, నువ్వీమధ్య బొత్తుగా కనబడనమే లేదే! ఏం విశేషము?

గౌరి:— ఏముంది విశేషం! ఈమధ్య తనపెళ్లయింది మొదలు, మహారాణి మున్నూడన్ను అదేవో వ్రతాలు చేసుకుంటూ, యీమూడుమాసాలు నీసుంగా వుంచి. అందుకోసనని, నన్ను యెప్పుడూ తనకాణ్ణే వుండమని వుత్తరువు చేసింది. నాకూ యీమూడు మాసాల్నుంచి బొత్తిగా తీరికె లేకుండా వుంది.

ముత్యా:— కొత్త పెళ్లికూతురు! అప్పుడే నోములూ, వ్రతాలూ ఎందుకో!

గౌరి:— మనకేం తెలుసునే! వాళ్లు గొప్పవాళ్లు. వాళ్లవుద్దేశ్యా లేమిటో మనకు చెప్తారూ? వాళ్లు చెప్పినపని చెయ్యడం మనవంతు సరేకాని, మహారాజుగారివె బడే వుండే దానివి గదూ! విశేషా లేమీ లేవూ?

ముత్యా:— మరేమీ లేవుగాని, ఈమధ్య మహారాజుగారి అంగరక్షకులకంతా అధికారిగా ఒక కొత్తాయన నౌకరీలో కుదిరాడు.

గౌరి:— ఎవరే ఆకొత్తాయన?

ముత్యా:— చూస్తే అదేదో చాలాదూర దేశం వాడి లాగుంది కట్టు,బొట్టు,వ్యవహారము. భాజవాను. దండలువడిదిరిగి ఆఅోమ్మాగిమ్మా అంతా భీముడులాగ వున్నాడు. మంచి చూపరికూడా.

గౌరి:— కొత్తగా నౌకరీలో కుదిరేవాళ్లంతా మొదట యీ లాగే వుంటారులే! పోనీ, మన కెందుకు ఆవూసంతా! ఎందుకు నన్నంతగా అరిచి పిలిచావే! తొందరగా వెళ్లాలె బోలెడు పనుంది.

ముత్యా:— ఎప్పుడూ పనేనే నీకు! అంతగా విరగబడి నువ్వు చేసేదేమిటో చెప్పు? ఇన్నాళ్లకు సెలవుగా యివ్వాళ కనపడ్డావు. కొంచెం సేపు కులాసాగా లోకాభిరామా యణం చెప్పుకుందామనుకుంటేనూ?

గౌరి:— అది కాదే. మహారాణిగారు చేస్తున్నవ్రతానికి యివ్వాళ వుద్యాపన బ్రాహ్మలకి, ముత్తైదువులకి, ధోవతులు, చీరలు, రైకలు, వాయినాలు, దానాలు, దక్షిణలు ఎన్నోచేస్తారు. అవన్ని దగ్గరుండి అందివ్వాలె. లేకుంటే ఆమెగారు కోప్పడుతుంది.

ముత్యా:— అట్లాయితే నీపంట పండిదన్నమాటే! ఇంక మేము నీకండ్ల కవుపడతామా?

గౌరి:— చాల్లేవే నీ పొడిగింపులు! ప్రభువు మనసుపడితే నీ కైతేమాత్రం కొరతేముంటుంది! సరేగాని, అసలు మాట చెప్పలేదే!

ముత్యా:— ఏమీ లేదే! పెళ్ళయింది మొదలుకొని యీవ్రతాలూ, నోములూ యేమిటే యీవాయిసులో హాయిగా చిలకాగోరింకల్లాగు భార్యాభర్తా సుఖంగా, ఆలాజాలంగా వుండకుండాను?

గౌరి:— [ముత్యాలు చెంపమీద నెమ్మదిగా చరిచి] ఊరికే వదరబోకు నీకు మళ్ళీ ఎప్పుడూ మొగాళ్ళమీదపడి అల్లాండాలే? నీ యీడకి తగ్గట్టు అన్నావు. ఎవరన్నావింటే వీపు చెక్కలు తెగుతుంది. [ప్రవేశము చెల్లాంబ]

ముత్యా:— ఒసే గౌరీ! ఎవ్వరే ఆ వొచ్చేది? అబ్బో! రాణీ వాసాన్ని మించివుందే!

గౌరి:— నీకు తెలీదూ! "చెల్లాంబ" ని ముమ్మడమ్మగారి పుట్టింటినుంచి వొచ్చింది.

ముత్యా:— [చెల్లాంబనుచూచి] చెల్లాంబా! నీవు మహారాణిగారి దగ్గరనుంచి పుష్పమేమైనా తెచ్చావా? అట్లయితే యీ లాగియ్యి! నేను తీసుకెళ్ళి మహారాజుగారి దగ్గరనుంచి ఖడ్గం తెచ్చియిస్తాను.

చెల్లాంబ:— ఓయమ్మో! యీకట్టుదిట్టాలేమీ మా రాణీగారికి పనికిరావమ్మా! ఆమెగారే స్వయంగా మహారాజు

గారిని చూస్తారు యీ రాత్రికి. గాక! పోదము పద. అక్కడ ముత్తైదువులకి వాయనాలు, తాంబూలాలు యివ్వాలె అందుకే నేను వచ్చింది

ముత్యా:— చెల్లాంబా! మహారాజుగారు అవేవో రాచయెవా రాలలో వున్నారు వుంటారో వుండరో!

చెల్లాంబ:— అబ్బా! దేవిగారు చాలా పట్టుదలగా వుందే! కానీ! ఏమయితేనేం! రాణిగారికి చెప్పిచూస్తాను.

[అందరు నిష్క్రమింతురు.]

— తెర —



అంకము 2  రంగము 2

రాజాంతఃపురము-రుద్రమదేవమహారాజు శయ్యాగారము.

[ప్రశాంతమున, సర్వాలంకారశోభితయై వీణవాయించుచు ముమ్మడమ్మ పాడుచుండును. శయ్యాగారము చిత్రముగా నలంకరింపఁబడి యుండును. రుద్రమదేవుఁడు ప్రవేశించి, ముమ్మడమ్మనుఁ జూచి, నివ్వెర పడును. సంకోచించుచు పాటవినుచుండును ]

ముమ్మడమ్మ:— [వీణ వాయించును]

పాట. జంఝూటి. ఆదితాళము.

పురహరం - శంకరం - భజరే ॥పు॥
రణరుద్రా - గంగాధరా - పరమేశానమస్తే ॥పు॥
నీలగళా - నిటలాక్షా - ఆర్తరంతీరక్షణ
నటరాజా - గౌరీరమణా - అర్ధనారీశ్వరా ॥పు॥

భటుడు:— [ప్రవేశించి] జయం ఏలినవారికి మహాప్రభూ! యుద్ధాలోచనసభలో అధికారివర్గము ఏలినవారిరాకను ఎదురుచూస్తున్నారని మహామంత్రిగారు మనవిచెయ్యమన్నారు.

రుద్రమ:— అవును! చాలముఖ్యమగు విషయము! దేవీ! నీవిట నొంటిగా నుండనేల? చెలులతో నీశయనాగారమున కరుగుము. నేను రహస్యాలోచనసభ కేగవలయును. యాదవులు మనపై దండెత్తివచ్చుచున్నారు ఓరీ! శిరోవేష్టనాదులం గొనిరమ్ము

ముమ్మడమ్మ:— నాథా! మిమ్ము వెడలిపోవ నాజ్ఞ యొందు. తమకు వలసిన యుడుపుల నేనందిత్తును. ఓరీ! మహారాజుగారిదె వచ్చుచుండిరని మహామాత్యులకు దెలుపుము. పొమ్ము.

భటుడు:— మహాదేవియాజ్ఞ. [నిష్క్రమించును]

రుద్రమదేవుడు:— సుకుమారివి నీకేలయీశ్రమ! పరిచారకు లెందఱులేరు? అదియుగాక, శిరోవేష్టనాది ధారణము స్త్రీల కేమి తెలియును?

ముమ్మ:— మీపరిచర్య నాకు శ్రమాపాదక మగునా? ఆనంద దాయకము నా బాల్యమున, నాజనకునకుఁ గూడఁ గవచ శిరస్త్రాణాదులను సనుకూర్చి వారికవి ధరింపఁజేసి ముచ్చట పడుచుండెడిదానను.

రుద్రమ:— అగుఁగాక. బాల్యముతోడ నప్పటి చేష్టలును, మనో భావములును మాఱుట సహజము ఇప్పుడు మహారాజ్ఞీ పదము నొందియున్నావు, పరిఁగొనవలసిన దానవు పని చేయుట గౌరవమునకు లోపముగదా! ఇట్టిస్వల్పవిషయ ములయందు నీవు స్వయముగ శ్రమపడ నేల?

ముమ్మ:— పతికిఁ బతిసేవయందుఁ గాలాకాల నిర్ణయమును, న్యూనతాధిక్యతలును నేమున్నవి? దర్శన స్పర్శనాలాప శయ నాసన భోజనంబులవలనఁ గలుగు సుఖంబులు దంపతులకు వలదా? ఇంతమాత్రపుఁ జనవునకుఁ గూడ నేను తగను కాఁబోలు!

రుద్రమ:— ఇంతలో విన్నఁబోనేల? ఇది యేమంత ఘనతరవిష యమని యట్లంటిని. దేవీ! నీవే కొనిరమ్ము.

ముమ్మ:— ఎంత యానందము! నేడు మి మ్మతిచిత్రముగ నలం కరించి కన్నుల పండువుగఁ దిలకించెదను.

పాట.

అలంకారంబును నేజేయుటచే - ధన్యతజెందితినాథా ॥౨॥
సుందరతరముగ శోభాకరముగ నేజేతుఁ సొగసుగ నేజేతుఁ
విజయంబగుగా మంగళమగుగా రణఫలితంబు నాప్రార్థనయిది
కవచంబిదిగో ఆభరణములివే నేజేతుఁ సొగసుగ నేజేతుఁ ॥౩॥

[పాడుచు దుస్తులుదెచ్చుటకు లోనికరుగును]

రుద్రమ:— విషమసంకటము!

[రుద్రమదేవుఁడు ప్రక్కనుండు నిలువుటద్దమునద్దకుఁ బోవును. వస్త్రధారణమునకు సిద్ధపడును]

ముమ్మడి:— [దుస్తులతో బ్రవేశించి] ఇది శిరోవేష్టనము. ఇది కంచుకము. ఇదియుపరికంచుకము. ఇవే హారాదికములు, ధరింపుఁడు నేను సాయపడెదను.

[అని రుద్రమదేవుని సమీపించి, యలంకరించు సమయమున రుద్రమదేవుని యందు స్త్రీరూపము ప్రకటమగును. ముమ్మడమ్మ విస్మయావిష్టయై, శోకభారమున "హా" యని మూర్ఛిల్లును]

రుద్రమ:— [త్వరగ వస్త్రధారణము ముగించి స్వగతము] ఎంత యనర్థకరసంఘటనము! దీని పర్యవసాన మెట్లుండునో? [ప్రకాశము] ఎవరక్కడ?

గౌరి:— [త్వరగ బ్రవేశించి] దేవా! ఏమియాజ్ఞ!

రుద్రమ:— ఈమె మూర్ఛిల్లినది. లోనికిఁ గొనిపోయి యుపచరింపుఁడు. [నిష్క్రమింతును.]

[గౌరి శిశిరోపచారము లొనర్చును.]

ముమ్మడ:— [తేరి, లేచి,] ఓసీ! నీవు చెల్లాంబ నతిత్వరితముగ నిటకంపుము.

గౌరి:— అమ్మా! ఏల నేడిట్లున్నారు?

ముమ్మడ:— అధికప్రసంగీ! చెప్పినపని చేయుము పొమ్ము.

గౌరి:— తమయాజ్ఞ. [నిష్క్రమించును.]

చెల్లాంబ:— [ప్రవేశించి] చెలీ! ఏల నేడిట్లున్నావు?

ముమ్మడ:— చెలీ! నాజీవిత మిట్లు వ్యర్థమైపోయినదే మే!

చెల్లాంబ:— ఏమిప్రమాదము? ఏల యింతగా దుఃఖించెదవు? సఖీ. తేకువవొందుము.

ముమ్మడ:— చెల్లాంబా! నాబ్రదుకు నిర్గంధకుసుమము వలె నిరర్థకమై పోయినది.

చెల్లాంబ.— అయ్యో! నీమాటలు వినిన నాకు భయమగుచున్నది. నే డిట్లు శోకాంవైతి వేమి?

ముమ్మడ:— హృదయవిదారకమే! నీతో నేమని చెప్పుదునే? ఇట్లగునని కలలోనైనఁ దలఁపనైతినే! చెలీ! నేనెంత యభాగినినైపోయితినే! నాకు ఐహికసౌఖ్యము గగన కుసుమమై పోయినదే!

చెల్లాంబ:— సఖీ! కారణముఁ దెలుపకయే నీసంతాపముచే నన్నుఁగలవరపెట్టుచున్నావు? ఇప్పు డేమంతవిపత్తు కలిగినది?

ముమ్మడ:— ఆపదయా? ఎట్లు చెప్పుదునే? [చెవిలోచెప్పును]

చెల్లాంబ:— ఏమీ! వింతగా నున్నదే? భ్రమపడితివా యేమి?

మున్నడ:— అయ్యో! వెఱ్ఱిదానా! నాకన్నులే నన్ను మోసము చేయునా? ని...జ...ము...గ...

చెల్లాంబ:— ఇది యే మన్యాయము! ఎంత నిగూఢ విషయము! అబ్బా! మోసము.

మున్నడ:— ఇప్పు డేమి కర్తవ్యము?

చెల్లాంబ:— నాకేమియుఁ దోపకున్నది.

మున్నడ:— నన్నింత ద్రోహముఁ జేసిన సహింతునా? ఇప్పుడే సభారంగమున నీ రహస్యము నుద్ఘాటించెదను. నీవు వారా పినతల్లికుమారుఁడు వీరేశ్వరున కీయుదంతము నెఱిం గింపుము పొమ్ము.

చెల్లాంబ:— ఊరడిల్లుము సఖీ! త్వరపడినచో నింకను లేనిపోని యనర్థములుత్పన్నము లగునేమో!

మున్నడ:— నేను సహింపఁజాలను. ఏమైనఁగానిమ్ము. నీవి నుఱ్ఱట లూగింపక. విడువను. నీవు పొమ్ము. పొమ్ము.

[నిష్క్రమించును.]

చెల్లాంబ:— దైవమా! ఈబాలిక కిట్టి దురవస్థఁ గల్పించితి వేమి? అంత నిర్దయుఁడవా? ముం దేమి కానున్నదో

[నిష్క్రమించును.]

తెర —

అంకము 2  రంగము 3

రహస్యాలోచన సభాభవనము.

[రుద్రమ దేవుఁడు, గణపతి దేవుఁడు, శివదేవయ్య, గన్నయామాత్యుఁడు సోమయామాత్యుఁడు, విశ్వేశ్వరశంభుఁడు యథోచితముగ నాసీనులైయుందురు.]

శివదేవ:— అమాత్యులారా! దేవగిరి రాజ్యమునకు, మన రాజ్యమునకుఁ గల సరిహద్దులలో యాదవులు చేయుచున్న దౌర్జన్యములనుఁ గూర్చి నేఁడు మన వేగులవలన వింటిమి. కావున సామ్రాజ్యక్షేమాభిలాషులును, మహావీరశిఖామణులు నగు మిమ్ముఁ గర్తవ్యవిర్ధారణ మొనర్పఁ గోరుచున్నాను.

విశ్వేశ్వర:— ఏమైన నగుఁగాక. ఈ నాస్తికాథము నీమారు పూర్తిగఁ ద్రొక్కి వైచితీరవలయు నని నా యభిప్రాయము.

సోమయా:— మహాప్రభూ! విధానాంతరము లోపము. మనము శాంతిఁబూని యూరకున్నచో, వీఁడు చెలరేగి, సామ్రాజ్యమును విప్లవసముద్రమున ముంచి వేయుఁగలఁడు.

గన్నయా:— సైన్యము లెప్పుడును సన్నద్ధములే! ఏలినవారి యాజ్ఞయే తరువాయి. దేవగిరినామము చరిత్ర నుండి లుప్తమైపోఁగలదు.

రుద్రమ:— ఉచితమునే తెలిపితిరి. నాయూహలన్నియుఁ దాఁచు చూరైనందున మీతో నేకీభవింపక విధిలేదు కాని, దేవగిరీశ్వరుని యపహాసమునకు మాత్రిం చింతిల్లుచు న్నాను. కానున్నది కాకమానదు. ఇకఁగార్యపథముకను నిర్ణయింపుఁడు.

గన్నయా:— దేవగిరిసైన్యము మనబలముకన్నఁ జాలతక్కువ. కావున నతనినిఁ బరాజితునిఁజేయుటకుఁ బ్రబలసన్నాహ మనవసరము.

గణపతి:— వైరిబలముల పరిస్థితు లెప్పటికప్పుడు మనకెఱుక పడుటకు మనవేగులను మునుపటికన్న మిగుల హెచ్చరికతో మెలఁగునట్లుకూడ నాజ్ఞాపింపవలయును.

శివదేవ:— అవును.

[నేపథ్యమున అధికారసూచక స్వరముతో "లోనికిఁదారివదలుఁడు" అను ధ్వని ]

గణపతి:— ఎవరక్కడ?

ముమ్మ:— [ప్రవేశించి] ఓసార్వభౌమా! ఎంతద్రోహము! ఎంత మోసము!

[రుద్రమదేవుఁడు తలవంచును. అమాత్యాదులు విభ్రాంతపడుదురు. గణపతి వెలవెలఁబోయి మఱల ధైర్యము వహించును ]

గణపతి:— ఏమి యీవిపరీతము! శుద్ధాంతకాంత లిట్లు అనాహూతులై సభారంగమునఁ బ్రవేశింపవచ్చునా?

ముమ్మడి:— ఏమీ! శుద్ధాంతమా! ఓమహారాజా! మీహృదయమున మానవత్వము లేదా? జగదేకవీరుడై, మీకుఁ గుడిభుజమై, సామ్రాజ్యక్షేమమునకై తనసర్వశక్తులు ధారవోసిన ప్రభుభక్తిపరాయణుఁడగు మాతండ్రి సేవనైన దలఁపక నాజీవితము నిట్లు శాశ్వతదుఃఖభాజనముగ నొనర్ప మీమనసెట్లొప్పెను? నాబ్రదు కేమి కావలయునని తలఁచితిరి?

[గణపతి, విశ్వేశ్వరశంభువు, మొదలగువారిపోదురు. ఇతరులు వెలవెలబోయి, యొకరినొకరు మాచుకొందురు. రుద్రమదేవుఁడు వంచినతల యెత్తకయుండును.]

ముమ్మడి:— సభాసదులారా! మీ రాఁడుకోమనఁ బుట్టరా? ఆడుబిడ్డలఁగనరా? మీబిడ్డల కిట్టిదుర్గతి సంభవించిన నోర్వఁగలరా? ఇట్టి దురాగతమును సహింతురా?

గణపతి:— ఏమి యీయసంబద్ధ ప్రసంగము!

ముమ్మడి:— అసంబద్ధ ప్రసంగమా? పాపభీతిలేక, పాలకై పొదుగుఁగోయు చందమునఁ బ్రవర్తించితిరే? మీస్వార్థపరత్వపిశాచమునకు నాజీవితమును బలిపెట్టుట యెట్టి న్యాయము? పరమేశ్వరుఁడైన నిట్టి యన్యాయమును సహించునా? నాకు సరియైన సమాధానమిందు లేనిచో... ... ...

విశ్వే:— అమ్మా! శాంతింపుము. యుద్ధానంతరమున నీవిషయమును సావధానముగఁ జర్చించి, యుచితమునట్లు చేయుదము.

ముమ్మ:— ఎట్లు శాంతింపగలను? ఇచ్ఛాపూర్వకముగ మీరు నాకొనర్చిన ద్రోహమునకుఁ బ్రతిక్రియఁ జేయక విడువఁజాలను. మాయన్న వీరేశ్వరున కీయుదంతము నిప్పుడే యెఱుకపఱచితిని. అతఁడు ప్రజలకు వెల్లడించియుండును. మీప్రజలే నాభవిష్యత్తును నిర్ణయింతురుగాక.

రుద్రమ:— [స్వగతము] మించిపోయినది. [ప్రకాశము] అమాత్యులారా! దండయాత్రకు వలయు సన్నాహమును శీఘ్రముగ గావింపుఁబోవుడు. కులదేవతారాధనమునకై రేపు మొగిలిచెర్లకును వడ్డెపల్లెకును బోయి రావలసియున్నది. అందులకుఁదగు నేర్పాటు గావింపుఁడు. నేఁటికి సభ జాలింతము.

[రుద్రమదేవి, ముమ్మడమ్మ తప్ప కడమవారలు నిష్క్రమింతురు]

రుద్రమ:— మండలేశ్వరుని పుత్రికవు, విదుషీమణివి. రాజనీతిజ్ఞవు, వివేకమంజులవగు నీవింత సాహసించుట తగునా? పామరప్రకృతులంబోలె మౌర్ఖ్యమూనుట నీవంటి సతీతిలకమున కుచితమా?

ముమ్మ:— సార్వభౌముని పత్నినని నాయభ్యుదయమున కుప్పొంగుచు, నైహికసుఖానుభవప్రాప్తికై యువ్విళూ

యుచున్న నా యాశాసౌధ మొక్కమాటుగ, నాకస్మిక ముగ, అన్యోన్యకముననుం గూలిపోవ, నెట్లు సహన మూనఁగలను? పవిత్రమగు మనసాక్షికి విరుద్ధముగ, మీ నైజప్రకృతిని మాటుపఱచి, యబలనగు నన్ను శాశ్వతదుఃఖైక జీవితముఁగావింప మీ రెట్లొడబడితిరి? మీ హృదయము.........

రుద్రమ:— పరిభవానలతప్తహృదయవగు నీవిప్పుడు న న్నెంత తూలనాడినను కోపింపను. కాని, మనఃపూర్వకముగ నే నిట్టియకృత్యమునకు బాల్పడలేదనియు, సార్వభౌము డగు నాజనకుని యాజ్ఞానిర్వహణమే కర్తవ్యమను నిశ్చ యముతో నిందుల కీయకొంటి ననియు నీవు నమ్మిన జాలును. వివాహమైనదాదిగ, నాహృదయ మెట్టి తీవ్ర యాతనకు లోనై క్షోభించుచున్నదో మహేశ్వరున కెఱుక.

ముమ్మ:— మహాదేవీ! సార్వభౌము లిట్లు ప్రవర్తించుటలో వారి యుద్దేశ మేమి?

రుద్రమ:— నాజనకు లిట్లు కైతవ మొనర్చుటకుగల కారణము నీకు సావకాశముగ నెఱింగింతును. కాని, భారతరమణివి, విశుద్ధవీరసజాతివు, నీ విట్లు నొఱకుదనమూనిన నే నేమనగలను? ప్రకృతము శత్రువుల దండయాత్రలనుండి రాజ్యమును ప్రజలను రక్షింపవలసియున్నది. ఇట్టి సంక

టసమయమున, సామ్రాజ్యముయొక్కయు, ప్రజల యొక్కయు క్షేమాపాదనమునకై యెట్టిత్యాగమునకైనను సిద్ధపడవలసిన నిముబోలు వీరపుత్రి, స్వప్రయోజనార్థినియై గృహచ్ఛిద్రములకు దోహద మొసఁగుట యెంత యవివేకమో యోజింపుము. నాకారణమున దుఃఖమయమైపోయిన నీజీవితమును అనుపమసౌఖ్యాకరముగ నొనర్చుట కెట్టిత్యాగ మొనర్పవలసినను వెనుదీయనని నమ్ముము. ఈవిప్లవ ముడిగినపిదప, యథాయోగ్యముగు సంవిధానమును నేను స్వయముగ నడపెదను. కనుక, గతమును విస్మరించి, స్థిరచిత్తవై రాజ్యారక్షణకుఁ దోడు చూపుట నీకు ముఖ్యకర్తవ్యము నేను రాజును, నీవు రాణివి.

ముమ్మడ:— [కన్నీరు నించుచు, మోకరించి, తలవంచి,]

అనఘుఁడు ముమ్మడప్రభున కాత్మజనై జనియించి, కాకతీ, యన్నృపులయిల్లు మెట్టి మహిత్రైహిక సౌఖ్యము గోరుచున్న నే ననుకొననైతి నితఁడి మహత్తర శోకము గల్గువంచు నో యనఘ! హతాశనైతి నిక నాశ్రయులెవ్వరు మీరుదక్కఁగన్.

రుద్రమ:— కుమారీ! గతమునకుఁ జింతింపకుము. ప్రజాశాంతియే నాముఖ్యోద్దేశము. అందులకై యెట్టిభయంకర విపత్తునైన నెదుర్కొనసిద్ధముగ నున్నాను రమ్ము పోవుదము. [నిష్క్రమింతురు.]

— తెర

## అంకము 2 - రంగము 4

ఓరుగంటిలో రాజభవనమున నొక రహస్యగృహము.

[గణపతిదేవుడు, విశ్వేశ్వరశంభువు కూర్చుండి సంభాషించుచుందురు. ప్రక్కను రుద్రమదేవి ప్రచ్ఛన్నముగ నిలిచియుండును.]

గణప:— ఎంతటి విషమసంఘటనము! ఇక దారియెద్ది?

విశ్వేశ్వ:— సాహసించినందులకు ఫలమిది. సార్వభౌమా! విచారించినఁ బ్రయోజనము లేదు.

గణప:— గురుదేవా! ఇప్పు డేమిచేయుదము?

విశ్వేశ్వ:— నాకేమియు దోచుట లేదు.

గణప:— ఆమూర్ఖురాలు శివమెక్కినట్లు విచ్చలవిడి బ్రలాపించుచుండ నానోట మాటయే రాదయ్యె నేమి? నా ధైర్య మెందడగిపోయెనో?

విశ్వేశ్వ:— అపరాధిహృదయమున స్వభావమే యది. మన మొనర్చినది యన్యాయమని మనయంతరాత్మలు మనలను హెచ్చరించుట లేదా?

గణప:— చిరకాలగుప్తమగు నారహస్య ముద్ఘాటితమగుట నా కెంతటి సంక్షోభ కారణమైనది! రాజకీయ నియోజక వర్గమునందును, ప్రజలయందును నెంతయాందోళన! ఆహా! నాయుగాహాసౌధ మొక్కసారిగ బాతాళమునకు గూలిపోయినదే!

విశ్వే:— రాజ్యతృష్ణ! సార్వభౌమత్వ కాంక్ష!

గణప:— గురుదేవా! నిండోలగమున నా బాలిక యట్లాక్రోశింపకున్న నేమిపోయెను?

విశ్వే:— అబలాహృదయము! మాతాపితృవిహీన. గైహిక ధర్మ మెఱుంగని కేవలముగ్ధ. పట్టమహిషీపద విభ్రాజితయై, వినిర్మలానురాగానందముల కాకరమగు దాంపత్యమున కువ్విళ్లూరుచుండి, యట్టిదాంపత్యము, లభించియు ప్రకృతివిరోధముగఁ బరిణమించినప్పుడు, స్వర్గతుల్యము గాఁదగిన యైహికజీవితము నితాంతదుఃఖనిలయమై పోయినప్పుడు, ఏ స్త్రీహృదయము, నిజదౌర్భాగ్యమునకుఁ బరితపింపక, నిరాశాద్యోతక శోకారావ మొనర్పక సహించి యుండగలదు?

గణప:— బహిర్గతమైన యీవిషయమును మాటుపఱచుటెట్లు? పౌరులలోఁ బ్రబలిన యశాంతికి సమాధాన మేమి?... దండోపాయము నవలంబించియైనను, నాకోరికఁ దీర్చుకొందును. ఇప్పటికిని మించిపోలేదు.

విశ్వే:— సాధ్యమా! సార్వభౌమా! అందువలనఁ బ్రజలకే గాక, ముమ్మడరాజుపక్షీయులగు సామంతులకునుఁ గ్రోధము గలుగును. ఇప్పుడాతఁడు జీవించియేయుండినచో నెట్టివిప్లవముప్పతిల్లియుండెడిదో యాలోచింపుము.

గణప:— నిజమే! నాసంకల్పమువలన లాభములేదా?

విశ్వేశ్వ:— గణపతిదేవా! లేదు దండోపాయము ననుష్ఠించిన లేశమైనను లాభము లేదు. రాజ్యమల్లకల్లోలముల పాలగును. కావున నుపాయాంతరముచే లోకమునోరు మూయవలయును —. ఏదేని యొకకారణముఁ గల్పించి, ముమ్మడమ్మను రాజకీయరంగమునుండి తప్పించినచో...

గణప:— ఎట్లు?

విశ్వేశ్వ:— ఆమెప్రలాపము లున్మాదలక్షణములని ప్రకటించి, యున్మత్తవైద్యము కొఱకు దేశాంతరమునకుఁ బంపివేయుదము.

గణప:—రుద్రమ యొప్పుకొనునా?

విశ్వేశ్వ:— మనకార్యవిధానమును సరియైన కట్టుదిట్టములతో నడపితిమేని, యంగీకరింపక విధిలేదు. వైద్యశాలాధికృతులకు ముందుగ వాగ్బంధన మొనర్చి, వారిచేతనే యీమె యున్మాదినియని ప్రకటింపింతము.

గణప:— బాగున్నది.

రుద్రమ:— [ఎదుటఁబ్రవేశించి,] అవును, చాల బాగుగనున్నది. గొప్పరాజతంత్రము! కౌటిల్యునిఁగూడ సిగ్గుపఱచును. శుక్రునిఁగూడ త్రోసిరాజనును. రాజనీతిజ్ఞులను బోర్లఁ ద్రోయును.

[గణపతి, విశ్వేశ్వరశంభువు, త్రివ్వరడి యా మెను జూచుచును.]

రుద్రమ:— తండ్రి! పట్టాభిషేకసమయమున, నావివాహప్రక టన మొనర్చినపాటనుండియు నేను మిమ్ము వేడుకొనిన దంతయు నరణ్యరోదనమే యైనది. ఈపెండ్లి వలదని వే విధముల మిమ్ము వేడుకొంటిని. కాని ఫలమేమి? పితా జ్ఞాపాశమున నాకంఠముఁ బిగించితిరి. నాజన్మప్రకృతినిఁ గూర్చి యంతఃపురమున సందేహసూచకములగు గుజ గుజలు పొడముచుండెననియు, నట్టిసంఘటనముల నటి కట్టుటకే నేను పురుషుఁడనే యని లోకమునకు నిరూ పించుటకే యీవివాహముఁ దలపెట్టితిమనియు, నిందల కొడఁబడక తప్పదనియు, లేనిచో ముప్పువాటిల్లఁగల దనియు, మీరు నన్నుఁ గఠినముగ శాసించితిరి. మీ యాజ్ఞ నుల్లంఘింపవెఱచి, నాయంతరాత్మను విరోధముగ నిందల కీయకొంటిని. కాని ఈకపటనాటక మెంతకాలము సాగును?— రాజ్యమన్యవంశీయుల పాలగుననియు, విప్ల వములచే దేశము క్షోభించుననియుఁ దలంచితిరే కాని నాజీవితసమస్య యెంతవిషమమై పోయినదో లవమైన యోజించితిరా? స్త్రీప్రకృతినయ్యు నచంచల పితృభక్తి పూరితనై పరివర్తించినందులకు ఫలమేమి? నిరాశా పూరితదుఃఖమయ జీవనము. తండ్రీ! సార్వభౌమత్వతత్త్వ మిదియేనా?—. నన్నేగాక నవనీతమృదుల హృదయ

యగు మున్మదమ్మునుగూడ, నాజన్మాంత నితాంత సంతాపమునకుఁ బాల్పడఁజేయుట రాక్షసకృత్యము గాదా! పాలితులపట్ల నిట్టి కుహనావిధానము ప్రభుధర్మ మగునా?

గణప:— కుమారీ... ... ...

రుద్రమ:— తండ్రీ! క్షమింపుఁడు. నేటివఱకును మీయాన మీఱి యెఱుఁగననుటకు మీయంతరాత్మయే ప్రబలతర సాక్ష్యము. కాని, యిట్టివిషమపరిస్థితియందు గూడ మీ హృదయములు కాఠిన్యమును వీడనికతమునఁ బ్రతిఘటింపవలసివచ్చినది —

ప్రకృతివిరోధముగ నన్నుఁ బ్రవర్తింపఁజేసితిరి. పౌరుష ప్రధానములగు విద్యలన్నియు నేర్పించి, నన్ను సామ్రాట్టు నొనర్చితిరి కాని, పవిత్రములగు ప్రేమ దాంపత్యములకు దూరనైయసిధారా వ్రతమూని, క్షుభితహృదయముతో దుర్భరమగు జీవయాత్ర నెట్లు గడుపఁగలనాయని యోజింపరైతిరి. అంతతో బోక, మున్మదమ్ము యున్మాదినియని ప్రకటించి, మీభయంకర స్వార్థత్వాగ్నిజ్వాలల కామెనుఁగూడ నాహుతిఁజేయ సిద్ధపడుచున్నారు. [సశోకము] ఇంత యైశ్వర్యముండియు, సామ్రాజ్యాధిపత్యముఁబడసియు, మే మిరువురమును నిరాశాపూరిత హృదయములతో, కుంగి, కుమిలి, నశించిపోయిన చో మీమహదాశయములు ఫలించునా?

[ముందునకు తూలి, పడిపోవును. తెరలో గలకలము]

ద్వారః— [ప్రవేశించి] మహాప్రభూ! తొలిద్వారముకడ ప్రజలు తమదర్శనానికి తిరుగుబాటుచేస్తున్నారు. ఆపడానికి మాకు శక్యంకాకుండావుంది. ఏమియాజ్ఞ?

రుద్రమ:— [నెమ్మదిగా తలయెత్తిచూచి,] ఇదే వచ్చుచున్నాము.

విశ్వేశ్వ:— బిడ్డా! త్వరపడకుము.

రుద్రమ:— ఇక మీాద రాజకీయరంగమున మీాజోక్యమువలదు. సర్వమును నేను సమర్థించుకొందును. ప్రజలయెదుట యథార్థము వచింపకతప్పదు. ముమ్మడరాజు పక్షీయుల మోసపుచ్చుట నాకు సమ్మతముకాదు. ముమ్మడమ్మ భవిష్యజ్జీవితమును భగ్నమొనర్చుట కానిపని.

పౌరవ్రాతంబుమ్రోలన్ ప్రతినపలికెదన్ భర్గుడే సాక్షిగా బెం
పారన్ నేడే గ్రహింతున్ పటుమతిసుతగా మాన్యపూ
ముమ్మడమ్మన్
వీరుండగు రాజసూనున్ వెదకి సుదతికిన్ ప్రీతిమై బెండ్లిజేతున్
స్ఫారశ్రీరాజ్యలక్ష్మిన్ సతి తనయునకై సాధురీతిన్ త్యజింతున్
[నిష్క్రమించును.]

— తెర —

కోసమని యిక్కడ యెవ్వర్నీ వుండనీయొద్దన్నారు. ఆమాట చెబితే ఏమో వేళాకోళంగా వుందే?

గౌరి:— కోప్పడకండి. అయితే మీరు మాత్రం వుండొచ్చా?

1 వ భటు:— మేము కూడా వెళ్లాలిసిందే! వారుగో ప్రభువు గారు యిక్కడికే వస్తున్నారు. వెళదాం పదండి

[నిష్క్రమింతురు.]

[మహారాణిరాక నెదురుచూచుచు వీరేశ్వరుఁడు, పేరినాయఁడు మొదలగువారు కూర్చుండియుండగా రుద్రమదేవి ప్రవేశించును. అందఱు లేతురు.]

అందఱు:— చక్రవర్తినికి జయమగుఁగాక!

వీరేశ్వ:— మహాదేవీ! మావంశము ప్రభుభక్తికిఁ బుట్టినిల్లు. మా పెదతండ్రిగారు పెద్దరాజుగారియెడ నెఱపుచుండిన భక్తి, గౌరవ, విశ్వాసములు సుప్రసిద్ధములు. సామంత రాజసంఘములో మా పెదతండ్రిగా రెట్టిస్థానము బొంది యుండిరో తమహృదయములకే యెఱుక. అట్టి మా వంశగౌరవమునకు భంగకరముగఁ, దలవంపుగఁ బ్రభువులు వర్తింతురని స్వప్నమునైనఁ దలఁచియుండము. ఈవంచన సహింపరానిది.

పేరినాయ:— మహారాజ్ఞీ! ఇంతకాలమునుండియు మమ్ముఁ బాలించునది శ్రీరుద్రదేవమహారాజుగారనియే నమ్మి యుంటిమి. తమయభిషేకము, వివాహము, ప్రజల నానందసముద్రమున నోలలాడించినవి. ఆకస్మికముగ

నేఁడు తమ విషయమై యొక విపరీత ప్రకటన గావింపఁబడుటచే పౌరులయం దాందోళనగలిగినది.

రుద్రమ:— [తలవంచి వినుచుండును.]

1 వ పౌరుఁడు:— తల్లీ! మిథ్యావార్తనుఁ బ్రకటించి ప్రజలను మోసగింప నేల? సుప్రసిద్ధుఁడ లేశ్వరులగు మున్మడరాజుగారి పుత్త్రికవిషయమున మఱియు నన్యాయము జరిగిపోయినదే! ఆ దేవి గర్భమునఁ బొడమిన సుపుత్త్రుఁడు కాకతీయ రామాజ్యమునకుఁ బాలకుఁడు గాఁగలఁడని సంతసించుచున్న మాయుత్సాహముగూడ భగ్నమైపోయినదే! ప్రభువులైనను, బ్రజలైనను నిట్టియకృత్యములు సహింతురా?

రుద్రమ:— మహాజనులారా! జరిగినదంతయు నిజమని యంగీకరించుచున్నాను. అయినను నాజననకాలమునాటి రాజకీయపరిస్థితులును, నప్పటి ప్రభువులగు మాతండ్రిగారి చిత్తవృత్తియు నందులకుఁ గారణములు.

వీరేశ్వ:— పుత్త్రికనుఁ బుత్త్రుఁడని ప్రకటింపవలసిన యనివార్యమేమి సంభవించెను?

రుద్రమ:— వీరేశ్వరా! పుత్త్రోత్పత్తి నపురుచూచుచుండిన మా తండ్రికి నా జనన మాందోళనఁ గలిగించెను. కూటస్థుఁడగు ప్రోలరాజకాలమునుండియుఁ బరంపరగా

గాకతీయనరపాలురచే బాలింపఁబడుచు వచ్చిన యీ మహాసామ్రాజ్యము వారియనంతర మన్యుల పాలగునను శంక చేతను, మత కలహములవలన సామంతరాజులలో బొడముచుండిన వైషమ్యములు కాకతీయసామ్రాజ్య భవిష్యోన్నతికిఁ భంగకరము లగునను భీతిచేతను, రాజ గురువుల యుపదేశము నంగీకరించి, నన్నుఁ గుమారుఁ డనియే ప్రకటించిరి. తండ్రిగారికి మారాడనేరక నేను రుద్రమదేవుఁడనై వారి యభిప్రాయానుసారముగ మెలఁగుచుంటిని

పేరినాయ:— ప్రజలు కోరునది ధర్మపరిపాలనము. అందుకు రాజైనను, రాణియైనను జింతలేదు. పాలకులయెడ మాభక్తి, గౌరవ, విశ్వాసములు, పవిత్రములు, అచం చలములు.

వీరేశ్వ:— కాని, యీమోసపుఁ బెండ్లి యేల చేయవలెను?

రుద్రమ:— నాపౌరుషత్వమును దృఢపఱచి, లోకమును నమ్మిం చుటకై నాకు వివాహముఁగూడ చేసిరి. ఈరహస్యము నాపాలనమున వెలువడినది గాన మీకు సమాధాన మొసఁగుటకు నేను బాధ్యురాలనై యున్నాను— అయినను, నేడు మనరాజ్యము శత్రురాజులదౌర్జన్యము నకు వశమై పోవుచున్నది. దేవగిరిరాజు మనపై బడఁ

జూచుచున్నాఁడు. అతనినిఁ బ్రతిఘటించి, రాజ్యమును, ప్రజలనుఁ గాపాడుట ప్రథమకర్తవ్యము కావున మీ రెల్లరును నైకమత్యముతో సంధాబాధులరై తోడుపడుదురని యాశించుచున్నాను. మనమెట్లు క్రిందుమీఁదైననుఁ బరులజోక్యమున కవకాశ మొసంగరాదు.

వీరేశ్వ:— మహారాజ్ఞీ! తమసహనము, కార్యదీక్ష, హృదయవైశాల్యముఁ బ్రశంసనీయములు. ఎట్టి విషమపరిస్థితులయందైనను, అధర్మాచరణమునకును అవిశ్వాసమునకును మాహృదయములందుఁ దావులేదని నమ్మెదము.— కాని, తల్లీ! ముమ్మడమ్మ వ్యర్థజీవినియై పోవలసినదేనా? ఆమె మహారాజ్ఞి కానేరదుగదా!

[విశ్వేశ్వరశంభువు ప్రవేశించును.]

రుద్రమ:— వీరేశ్వరా! నేనంతకఠినహృదయ ననియే తలఁచితివా? నా కారణమున నామె కుసుమకోమలహృదయము శాశ్వతశోకాగ్నికింధనమై పోవుట కోర్వను సుమా? నాయనా! నేటిపరిస్థితులనుఁ బరికించినచో మా యిరువుర జీవితములును నిరర్థకములే యైనది. కాని, నిష్కలంకహృదయ యగు ముమ్మడమ్మయభ్యుదయమునకై, యామెసౌఖ్యమునకై, యీమహాసామ్రాజ్యమునైనను, నాసర్వస్వమునైనను, తుదకు నాశరీరప్రాణ

ముల నైనను ద్యజించుటకు సంసిద్ధనని నమ్ముము. నేటి నుండియు నామెను నాకభిమానపుత్రిగ స్వీకరించుచున్నాను. ఉత్తముండును, యోగ్యుండునగు రాకుమారున కామెనొసంగి వివాహమొనర్చి, యామెకుం జనించిన పుత్త్రునిం గాకతీయసామ్రాజ్యమునకుం బట్టభద్రునొనర్చెదనని హృదయపూర్వకముగ నుడువుచున్నాను. కావున నాపలుకులయందు విశ్వాసముంచి, దేశాభ్యుదయమునకుం దోడుసూప సిద్ధపడుండు. నేనే స్వయముగ నాయకత్వము వహించి యుద్ధకార్యములను నిర్వహింపనిశ్చయించితిని.

వీరేశ్వ:— ఆహా! ఎంత స్వార్థరాహిత్యము! ఏమి ప్రజారంజన దీక్ష! ఎట్టి విశాలహృదయము!

* ఆకాశ్రమంతి తరత్తరంగవిగళద్దుగ్ధాబ్ధిఫేనావళీ
రాచామంతిశరచ్ఛశాంక విసరజ్జ్యోత్స్నాప్రవాళామృతమ్
ఆకర్షంతిసురేంద్రదంతిదశన పాకారలగ్నాం శ్రియం
ముక్తాహారలతాయితా ప్రతిదిశంరుద్రాంబికాకీర్తయః॥

* రుద్రమదేవి దానశాసనము నుండి.

విశ్వేశ్వ:—

* సర్వోర్వీశకిరీటకుట్టిమ తటీవిన్యస్తపాదాంబుజా
శాస్త్ర్యేషా చతురంబురాశిరసనాం శ్రీరుద్రదేవీభువం
యస్యాజన్మమహాత్మ్యవోగణపతేః క్ష్మాపాలచూడామణేః
విస్ఫూర్జత్కలికాలకల్మష కథాధ్వాంతౌఘ తేజోనిధిః॥

— తెర —



* రుద్రమదేవి దానశాసనము నుండి



## అంకము 3 - రంగము 1.

విశ్వేశ్వరశంభుని పూజాగృహము.

[విశ్వేశ్వరశంభు-శివధ్యానమగ్నుఁడై యుండును. గణపతి యాలోచనాధీనుఁడై ప్రవేశించును.]

శ్లో॥ శివనామ విభావితేంతరంగే
మహతిజ్యోతిషిమానినీమయాబ్దే
దురితాన్యపహాంతి దూరదూరే
ముహురాయాంతి మహాంతిమంగళాని॥

గణపతి:— ఎంతయవివేకము! నేను పొరఁబడుచుంటినా! నాబిడ్డ పితృభక్తి యగణ్యము. ప్రజాక్షేమాకాంక్ష యనన్యము— నేనే కర్కశుఁడను. కాని,— నాముఖ్య నిగూఢ రహస్య ముద్ఘాటితమగుటయు, ఉచితప్రతిక్రియాచరణ స్వాతంత్ర్యము లుప్తమైపోవుటయు, నాకెంత యవమానము! సకలసామంతశిరోధార్యమైన నాయాజ్ఞ నా యింటనే. నాబిడ్డవలననే తిరస్కరింపఁబడుట—సహింపరాని విషయము.—

సూతికాగారము చెంతఁ బుత్త్రిజననమున కుప్పొంగులాయము, ఊహాసౌధ నిర్మాణమగ్నుఁడనై యున్న యానిముస ములు- ఆయుత్సాహము- ఆహా-రుద్రాంబజననము,- అంత ముఁదలక్రిందై పోయెను పుత్త్రికాజననవార్తాహారునికిఁ బహుమానము- ఒక్కొక్క ప్రాణాఘాతము —. కాని, త్రిలింగసార్వభౌముఁడనగు నాపట్టుదల కడగండ్లకు మూలమైనది, పలుకష్టముల కోర్చి, నేను విస్తరింపఁ జేసిన యీమహాంధ్రమహాసామ్రాజ్యము నేను జీవించి యుండఁగనే విప్లవములకు లోనగుటయా. —

విశ్వేశ్వ:— [కన్నులు దెఱచి చూచి, స్వగతము.] ఈమహారాజునకు దురభిమానమింకను నశింపలేదే? [ప్రకాశము.] సార్వ భౌమా! శివ మాను మన్నావా? దేవగిరిరాజు దుండగ ములకు మేఱ లేకున్నదే!

గణప:— మరల నేమి?

విశ్వేశ్వ:— ఏమా? మొన్న కులదేవతారాధనకై మొగిలి చెర్లకుఁ బోయినప్పుడు, దేవగిరీశ్వరప్రేరితులై, హరి హర, మురారులు, మన రుద్రాంబా మున్మొగమ్ముల హరింపఁబూనుట యెఱుఁగనా?

గణప:— నాబిడ్డనే హరించుటా?

విశ్వేశ్వ:— మఱేమి? నేటి గణపతిదేవుఁడు యాదవరాజునకు

మశకప్రాయుఁడు. సమర్థురాలు గనుక, రుద్రాంబయు వారిందాకి వధింపఁగలిగినది.

గణప:— మఱి ముమ్మడమ్మగతి?

— సమయమునకు నిదుబోలు యువరాజగు మహాదేవ రాజు అడ్డుపడకున్నచో ముమ్మడమ్మగతి యేమైయుండెడిదో! శౌర్యనిధివని పేరు వ్రాసిన నీ విట్టి కిష్టపరిస్థితులలోఁ బందవలె మూలఁగూర్చుండి ప్రలాపించుచుండుట నాకు లజ్జాకరముగ నున్నదే!

గణపతి:— గురుదేవా! నేనే సర్వనాశకుఁడను— నాబిడ్డయే నన్ను ధిఃకరించెను.

విశ్వేశ్వ:— గణపతీ! ఇంకను నీ కీపట్టుదల యెందులకు? పురుషార్థసార మెఱుఁగవా?

ప్రజఁజెఱచి కూడఁబెట్టిన
నిజధనమది వలయు వ్యయము నిచ్చలుఁజేయుక్
ప్రజయును ధనమునుఁబొలిసిన
భుజబలమున నిలుపఁదరమె భూపతి కెంతున్ ?

మఱియును.

* జనలక్ష్మికి, ధనలక్ష్మికి
ననుపముమగు ధర్మలక్ష్మికాత్మయు మూలం

* "పురుషార్థసారము" నుండి.

బని, యాత్మరక్ష, మఱియక
జననాథుఁడు సేయవలయు సతతముప్రీతిన్॥

గణపతి:— ప్రతిక్రియ వలదా?

విశ్వేశ్వ:— ఇంకను మాధ్యమేనా? కాకతీయమహా సామ్రాజ్యమునుఁ గల్లోలములో ముంచుచున్న వైరుల నేమియుఁ జేయఁజాలక, కడుపునఁబుట్టిన బిడ్డ, యనన్య గతికమై, యెదురాడినదని ప్రలాపించుచున్నావా? ఇంతవ్యర్థుఁడవై పోయితివేమి సార్వభౌమా!

గణపతి:— గురుదేవా! అంత్యనిష్ఠురము నామీఁదనా?

విశ్వేశ్వ:— మఱేమగుదువు?

గణపతి.—చూతురు గాక! దేవగిరిరాజుతలఁ దరుగక తిరుగను. రండు. యుద్ధభూమికే పోవుదము.

విశ్వేశ్వ:— సంతోషము. మఱి పరమేశ్వరుని ధ్యానించి వెడలుదము.

* దండకము:- శ్రీకంఠ, లోకేశ, లోకోద్భవస్థానసంహారకారీ, మురారి ప్రియా, చంద్రధారీ, మహేంద్రాది బృందారకానంద సందోహసంధాయి పుణ్యస్వరూపా, విరూపాక్ష, దక్షాధ్వరధ్వంసకా, దేవ, నీదైనతత్వంబుభావించి, బుద్ధిప్రధానంబు గర్మంబు విజ్ఞానమధ్యాత్మయోగంబు, సర్వక్రియాకారణంబంచు

* "తెనుఁగుభాగవతము"నుండి.

నానాప్రకారంబులం బుద్ధిమంతుల్ విచారించుచో నిన్ను భావింతు రీశాన, సర్వేశ్వరా, శర్వ.సర్వజ్ఞ, సర్వాత్మకా, నిర్వికల్ప ప్రభావా, భవానీపతీ, నీవు లోకత్రయీవర్తనంబుల్ మహీవాయుఖాత్మాగ్ని సోమార్కతోయంబులం జేసి, కావించి, సంసారచక్రక్రియాయంత్రవాహుండవై తాదిదేవా మహాదేవ,నిత్యంబు నత్యంత యోగస్థితి న్నిర్మలజ్ఞాన దీపప్రభాజాల విధ్వస్తనిస్సార సంసారమాయాంధకారుల్ జితక్రోధరాగాది దోషుల్ యతీంద్రుల్ యతాత్ముల్ భవత్పాద పంకేరుహధ్యానపీయూషధారాను భూతిన్ సదాతృప్తులై రవ్యయా, భవ్యసేవ్యా, భవా, భర్గభట్టారకా, భార్గవాగస్త్యకుత్సాది నానామునిస్తోత్రదత్తావధానా, లలాటేక్షణోగాగ్ని భస్మీకృతానంగ, భస్మాను విష్టాంగ, గంగాధరానీప్రసాదంబునన్ సర్వగీర్వాణగంధర్వులున్ సిద్ధసాధ్యోరగేంద్రామరేంద్రాదులున్ శాశ్వతైశ్వర్య సంప్రాప్తులై రీశ్వరా, విశ్వకర్తా, సురాభ్యర్చితా, నాకునభ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్యమూర్తీ! త్రిలోకైకనాథా! మహాదేవదేవా! నమస్తే నమస్తే నమః.

గణపతి:— [గురువునకు మ్రొక్కి] గురుదేవా! ఆశీర్వదింపుడు.

విశ్వేశ్వ:— మహేశ్వరానుగ్రహప్రాప్తిరస్తు.

— తెర

అంకము 3  రంగము 2.

యుద్ధభూమి.

[తెలుగువీరయోధులు ప్రవేశింతురు.]

— గేయము —

ఇదియె జయభేరిదె - యిదియె రణభేరిదె
జయభేరిదె - రణభేరిదె - జయజయ దుందుభులివియె ॥యిది॥
ఆంధ్రప్రతాపంబిదియె - వీరప్రభావంబిదియె,
అలవేలమలకీర్తియె - పల్నాటులపౌరశక్తిదె ॥యిది॥
యాదవమత కయ్యముకై - దేవగిరిదె నేలకూలె,
రాణ్మహిళారమ రుద్రమ - రాణపెంపుగా,
కాకతిశౌర్యము హెచ్చగ - గణపతిమది శాంతిగలుగ
మోగియునిదే వీరగీతి - మోగియును విజయంపుగీతి ॥యిది॥

[పైగేయమును పాడి నిష్క్రమింతురు — ప్రవేశము: రుద్రమదేవి పురుషనేపథ్యమున, రక్తసిక్తాంగకములతో గరవాలధారిణియై ]

రుద్రమ:— [స్వగతము] హా! తండ్రీ!

* "సీ॥ ఏరాజు రాజులనెల్ల జయించి ము
న్నెట్టికిఁ బెట్టె దోస్సార సమమున
నేరాజు సేతుసీహాద్రిమధ్యోర్వి
నేకపట్టణలీల నేలివచ్చె,

* "మారనమార్కండేయ" అవతారికనుండి.

ఏ రాజు నిజకీర్తి నెనిమిదిదిశల ను
ల్లాసంబునొంద నలంకరించె
ఏ రాజు తన తేజ మిూజగంబునకు న
ఖండైకవిభవంబుగా నొనర్చె,

నట్టి కాకతిగణపతి క్ష్మాధినాథు
డిప్డు డీమూదవులఁగెల్చు తెంపి యరిది?
అట్టియా భద్రప్రతాప మూర్తా డమూర్తి
యస్తమించెనె యీనాటికి కకటకట!

ఎంతరక్తపాతము! ఎన్ని మరణములు! ఘోరము! ఛీ! మునివృత్తి
సహస్రగుణము లుత్తమము.          [పరిక్రమించును]

[ప్రవేశము: వీరభద్రేశ్వరుడు గూఢవేషముతో, క్షతగాత్రుఁడై,
రక్తమానదోఁగుచు వివశాంగకములతో దూలుచు.]

వీరభ:— [బాధాసూచకముగా] అబ్బా! దా.హ-ము. [తూలును]

రుద్రమ- [ఉలికిపడి] పరిచితకంఠము! ఎవరిది? [చూచి] ప్రియా!

[వడిగా నటనున్న జలకుండికను గొని సమీపించి, పడఁబోవువాని
నాదుకొని పగుండఁజేసి, ముఖముఁదుడిచి, నీరు మెల్లగా నోటఁ
బోయును. వీరభద్రేశ్వరుఁడు ఇంచుకతెప్పిరిల్లి కన్నులు తెరిచి
చూచును]

వీరభ— [హీనస్వరముతో.] దేవి! నీ—తా.

రుద్రమ— [సగద్గదికము, సబాష్పము.] నేనే! ప్రభూ! దప్పితీరినదా!

— ఆఁ! దేవీ! శాశ్వత వియోగము! నా జీవితాకాశమున విద్యుల్లతవోలె మెరసితివి! అమూల్యమగు నీ ప్రేమ కుసుమ సౌరభము ననుభవింపఁజాలనైతిని. దురదృష్టము.

రుద్రమ:— ప్రభూ! మన వైవాహికానందరసకుండిక యప్పుడే యింకిపోయినదా! ఒకబొట్టయినను మిగులలేదా? [చేతనున్న కుండికను బారవైచును]

వీరభ:— దేవీ! నీవు నారాధ్య దేవతవు. మాయచే మఱుఁగుఁ బడిన నైజప్రకృతి యథాకారమునఁ బహిర్గతమగునట్లు నీవు చూపిన యనుగ్రహానురాగములను విస్మరింపఁ జాలను. ప్రతికృతి నొనర్పఁజాలకయే యంతరించుచున్నాను.

రుద్రమ:— ప్రభూ! ఇదియే జీవితావధియా! నిజమా! హా! దుర్భరము జనకుఁడు మున్నె నన్నువీడెను. ప్రియజన వియోగము కూడనా? ఎంత నిరర్థక జీవితము! ఏది దిక్కు! వలదు. ఈరాజ్యము వలదు తనువును వలదు జీవితమును వలదు.

వీరభ:— ఆఁ! కాకతీయ సామ్రాజ్యభాస్కరుఁ డస్తమించెనా?- దేవీ! ఊరడిల్లుము. త్వరపడకుము. కర్తవ్యమును విస్మరింపకుము. నీతండ్రియాత్మను అశాంతిఁ గూర్పకుము. సంతతికొఱకు గణపతిదేవసార్వభౌముఁ డనుభవించిన యనుతాపము, జననమాదిగ నీతండ్రి నీయెడ నెఱపు

చుండిన నిర్మలప్రేమవాత్సల్యములు, నీపురోభివృద్ధికై పడినకష్టములు, నీపదవిని సుస్థిరమును, నిరపాయము నొనర్చుటకై యొనర్చిన సాహసములు మఱువకుము. పితృఋణ విముక్తవు కాదలచితివో, నీతండ్రి నీపై మోపిన యీవిశాలసామ్రాజ్యపాలనా భారమును వహింపుము. ఆంధ్రనరపాలుర క్షాత్రము, పాలనాదక్షత, ప్రజారంజనదీక్ష నీవలననే జిరస్థాయి నొందవలసియున్నవి సుమా! దేవీ! [ఉద్రేకముతో లేవబోవుచు] సాహసోద్యోగముచుండి విరమింపుము. కర్తవ్యభారమూని, స్వర్గనివాసియగు నీజనకుని యాత్మకు శాంతిఁ గూర్పుము... కాని... ...

రుద్రమ:— ఏమి ప్రభూ!

వీరభ:— నా - చరమ - వాంఛితము!

రుద్రమ:— తెలుపుఁడు ప్రభూ! తెలుపుఁడు.

వీరభ:— ముమ్మడాంబా మహాదేవరాజుల వివాహము?

రుద్రమ:— ప్రభూ! అవశ్యముగ. నేనీవఱకే సంకల్పించుకొని యుంటిని. వారిప్రణయమును గుర్తించుకొనియున్నాను. శోకాంధకారావృతమగు నాజీవితాకాశమున మీచరమ వాంఛితమే వేగుచుక్క.

వీరభ:— అబ్బా! బా - ధ - దేవీ!- ఇక — నన్ను - మఱచి పొమ్ము.

రుద్రమ:— ప్రభూ! అచ్చటఁ దరుచ్ఛాయలో విశ్రమింప వచ్చెదను. [లోనికేగుదురు. కొంతసేపటికి రుద్రమదేవి ఒంటిగా మరలఁబ్రవేశించి కన్నీటితో] ఎంతటి విషమపరీక్ష! పరమేశ్వరా!

ధరణిపై నెబ్బదేనుగు నాయకులలోనఁ
బటుప్రతాపస్ఫూర్తిఁ బరఁగినాఁడు,
చండభుజాదండ మండితారాతుల
భండనంబునఁ జాలఁ జెండినాఁడు,
విక్రమంబున ధరాచక్రంబులోఁగల
బిరుదులు తనవిగాఁ దిరిగినాఁడు,
ఏపున నోర్గల్లు నేలు రుద్రుని చేత
నరుఁదైన కరవాల మందినాఁడు,

మొనసి తన రాజ్యసర్వస్వముఁ ద్యజించి
యితను తెలియంగని యట్లు లీహ్యాదమురాజ్య
సింహాపీఠంబుఁ దానధిష్ఠించినాఁడు;
చిక్కిపోయెను విధికి నేఁడక్కటకట!

[నిశ్చేష్టయై యుండును. నేపథ్యమునఁ దత్త్వగీతికాగానము వినబడును.]

పాట: ముఖారి: ఆదితాళము

లోకమె - తెరయూఁగా
నిఖిలమునకు నిర్ణేత
కాలచక్రమె - గతియె నీకిఁ జీవా _ ॥లోకమె॥

జంపెతాళము,

పుడమి చదరంగమే-
పుడమిచదరంగమును - పావులిటునటుతిరుగ
నడిపించువిధిరాజు బంటులనేకమై,
సకలభూతంబులను - నిర్మింపంబొనరించి,
ఏలగూల్చునో నేత - నటనసూత్రించితిమె, ॥లోకమే॥

చాపుతాళము

పితృభక్తికి సుతుఁడు భీష్ముఁడు - పరిణయంబును మానడే
భర్తృభక్తికి సతీసుమతి - పసుపు ప్రజ్ఞను వీడదే
త్యాగిజన్మమె శ్లాఘ్యమా
విరాగిజన్మమె చోద్యమా ॥లోకమే॥

— తెర —

అంకము 3  రంగము 3

ఓరుగల్లునగరమున నొక చతుష్పథము.

[జంగములు కాకతీయులచరిత్రమును గేయముగఁ బాడుచుందురు.]

జంగము:— మకుటము

శ్రీహిమశైలసుతా ప్రాణేశ్వర సేవక భయహరా హర హర
పాహి బిలేశయకంకణ శంకర పాప తిమిర హరణా॥

72-వ పేజిలోని సీసము వెలుగోటివారి వంశచరిత్ర నుండి.

కాకతీయ విఖ్యాత చరిత్రము ఘనముగ వినిచెదము
ప్రకటసౌఖ్యానందవర్ధనము పరమశుభంకరము ॥శ్రీహిమ॥
పరమమహేశ్వరసంప్రదాయుఁడై వరలినధరణిపుఁడు
అరిగజఘటలమృగేంద్రుడై మహా యశముఁగన్నవాఁడు ॥శ్రీ॥
కాకతీయవంశాంబుధిసోముఁడు ఘనుఁడు ప్రోలరాజు
సాకల్యముగఁ ద్రిలింగరాజ్యమును స్థాపించినరాజు ॥శ్రీ॥
చాళుక్యాన్వయ తైలపదేవుని సాధించిన దిట్ట,
చాలమంత్రకూటావనిపాలునిఁ జంపినబలుజెట్టి ॥శ్రీ॥
రూఢిగఁ బ్రోలనరేశు ప్రపౌత్రుఁడు రుద్రదేవరాజు
ప్రౌఢిగఁ ద్రైలింగ్యాధిపతిత్వముఁ బడసినట్టిరాజు ॥శ్రీ॥
నిరుపమబాహుపరాక్రమనిర్జిత నిఖిలవైరిచయుఁడు
పరమశైవమతభాస్కరుఁడై కడు వాసికెక్కినాఁడు ॥శ్రీ॥
ఏకశిలాపురి నతిసుందరముగ నేర్పరించినాఁడు,
ప్రకటముగవిద్యాతిశయుండై భాసిల్లినవాఁడు ॥శ్రీ॥
తెలుఁగు రాజ్యమును సుస్థిరముగను ప్రతిష్ఠ జేసితాను,
సలలితకీర్తి గడించెను ధరపై శాశ్వతంబుగాను ॥శ్రీ॥
ఆనృపవరాగ్రిమసోదరాత్మజుఁ డనఘ చరిత్రుఁడు,
ధీరుఁడు గణపతిదేవుఁడనంగఁ బ్రతిష్ఠఁగన్నవాఁడు ॥శ్రీ॥
పోరిలోన గాంగేయునితో సరిపోలినశూరుండు,
వీరవరుండటుల నిజరాజ్యముఁగడు విస్తరించినాఁడు ॥శ్రీ॥

శాత్రవకోటికి హృదయభల్లమై శాసించిననృపుఁడు
క్షాత్రమూర్తియై వెలిఁగిన సప్తమసార్వభౌము డతఁడు ||శ్రీ||
ఆనరపాలకమౌళి తనూభవ యమలగుణకలాప,
మానుగ రుద్రమదేవి జగజ్జన మాన్యయశోరూప ||శ్రీ||
కాకతివంశ వివర్ధనకారిణి ఖండితరిపుశ్రేణి,
ఏకవీర యవతారమె యని జను లెన్నఁ బరఁగు రాణి ||శ్రీ||

తరలము: పరగ రుద్రమదేవికొండొక భద్రకారణముటచే
సరగఁగైకొనె ముమ్మడమ్మరు స్వాభిమానత రూజఁగా,
నరసి యాయమ పుత్రునకు రాజ్యమొసంగెదనంచుఁదా
బురజనంబులమోలెఁబల్కెఁ, బ్రమోదమందిరిపౌరులు.

మత్తకోకిల: పెక్కుపోరుల ధీరయై తన వెన్నుఁజూపకనిల్చియున్
ఉక్కుమీఱిన వైరికోటుల నోర్చి గెల్చి యశంబు పెం
పెక్క రుద్రమదేవి రాజ్యము నేలె మెచ్చిన బాసనన్
దిక్కులన్ దనకీర్తి డిండిమ నిస్వనంబులు నిండగన్.

ఉక్కివుల్ దంద్రడియుఁ బ్రియుండును నోజదన్ విడనాడఁగా
మిక్కుటంబగుశోరవేగము గ్రమింగి, ధైర్యము శాంతియున్
దక్కఁబోకఁబ్రజానురంజన తత్పరత్వముతోధరన్
జక్క నేలె నిజాన్వయంపుఁ బ్రశస్తి హెచ్చఁగ మమ్మనన్.

తనయభిమాన తనూభవ మానస తత్త్వముఁగమనించి,
మానుగ నిడుబోలెల్ యువరాజగు నమ్మహాదేవ్రుగాంచి ||శ్రీ||

వారిరువురకును రుద్రమదేవి వివాహ మొనర్పఁగను
మీరిన కూర్మి చెలంగ దంపతులు మెలఁగుచుండఁగను ॥శ్రీ॥

అట్టియాదంపతులకుఁ బ్రియుంకరుండు
కాకతీయాన్వయ భాస్కరుఁడు ఘనుఁడు
అర్థిజనలోకమునుదార మతులఁబ్రోడ మోఁ
జొప్పడయైన బాలప్రతాప రుద్రమూర్తి ॥

వృద్ధగౌరి:— [ప్రవేశించి] అబ్బీ! ఏమిటి నాయనా! యీహడావిడి?

జంగము:— అవ్వా! రేపు బాలరాజుగారికి పట్టాభిషేకమంట!

వృద్ధగౌరి:— [చెవివద్దఁజేయి వుంచి] మైలారస్వామిజాతరా? ఎప్పుడు?

జంగము:— [నవ్వుచు బిగ్గఱగా] సీతల! జాతరకాదవ్వా! పట్టాభిషేకం.

వృద్ధగౌరి:— పట్టాభిషేకమా? ఎవరికి?

జంగము:— బాలరాజుగారికి.

వృద్ధగౌరి:— [బొమలు చిట్లించి] ఏ బాలరాజుగారికోయ్!

జంగము:— నీకు తెలీదూ అవ్వా! పెద్దరాణిగారున్నారే రుద్రమదేవిగారు! ఆమెగారు పెంచుకున్నకూతురు ముమ్మడమ్మగారి కుమారుఁడు ప్రతాపరుద్రరాజుగారికి రేపు పట్టంగడతారఁట. అందుకే యీసంబరమంతా!

వృద్ధగారి:— అట్లాగా! నేను నగరులో వుద్యోగంమానుకొని శానాయేండ్లు అయింది. నాకు యేసంగతీ తెలీదు. అయితే, పెద్దరాణి మనకి యిక కనబడదన్నమాట! ఏంనాయనా!

జంగము:— ఆమెగారు తీర్థాలు సేవించుకోడానికి వెడతారట.

వృద్ధగారి:— [కన్నీటితో] అయ్యో! తల్లీ మమ్మల్ని యిడిచి పెట్టేస్తున్నావా? అబ్బ! మావొద్ద యిల్లాలు యింతనూ నాకంటేగూడా పదియేనేండ్లు చిన్నవయసు. ఏం చల్లని తల్లి! ప్రజలంటే యెంతప్రేమ! అయితే అబ్బాయ్! ఎందుకూ యింత తొందర పెద్దరాణికి?

జంగము:— ఈమధ్యకలిగిన కష్టాలవల్ల అమెగారి మనస్సు చెదిరిపోయింది. అంచేత తీర్థాలుసేవిస్తే మనసు కుదుట బడుతుందనే అభిప్రాయం కలిగింది.

వృద్ధగారి:— నిజమే! నాయనా! మొదటినుంచి ఆ తల్లికి అన్నీ కష్టాలే! తండ్రిచూస్తే, పుట్టినప్పటినుంచి మొగాడిలాగ మెలగాలని నిక్కచ్చిచేస్తే, అట్లాగె గుట్టు బయట పడకుండా, దాసీలకు మాకు గూడా తెలియకుండా మెలి గింది మధ్యన ముమ్మడమ్మ పెండ్లిగోల ఒకటి! దాన్ని తెముల్చుకొని ప్రజలను సమ్మతి పరుచుకొనేటప్పటికి, యుద్ధం. ఆయుద్ధంలో తండ్రిగారు పోవడం. శివశివ!

అటువంటితల్లికి రాదగ్గ కష్టాలా యివి? అందుకనే ఆమెకు విరక్తిపుట్టింది! ఇక అటువంటి రాణిని మనం చూడబోము.

జంగము:— నిజమేనవ్వా! నువ్వు చెప్పింది! ఇన్ని కష్టాలు కలిగినా చలించిందిగాదు. ఎంతగాంభీర్యము! ఎంతో నిబ్బరంతో రాజ్యాన్ని చక్కగా పాలించింది. ఈశ్వరుడి దయ చల్లగా వుంటే; చిన్నరాజుగారుకూడా అంత వారవుతారు. మఱి పొద్దోయింది. వెడదాంపదండి.

[నిష్క్రమింతురు.]

— తెర —

అంకము 3  రంగము 4

రాజనగరులో సభామంటపము

[బాల ప్రతాపరుద్రరాజు. వయసు 10 సంవత్సరములు మకుటధారియై, సింహాసనాసీనుఁడై యుండును. ప్రక్కన రుద్రమదేవి, వయస్సు దాదాపు 40 సంవత్సరములు; ముఖమున వార్ధక చిహ్నములు ద్యోతకమగుచుండును. ప్రక్కన ముమ్మడమ్మ, షోడశవయస్క. ఆమె ప్రక్కన మహాదేవరాజు ఆసీనులై యుందురు. మఱొక పార్శ్వమున విశ్వేశ్వర శంభువు (ముదుసలి) పురప్రముఖులు నిలిచియుందురు.]

విశ్వేశ్వ:— [చేయెత్తి] ఓ మహాదేవి!

* శ్లో. హేమారుద్రోరజతా చ లేస్థిశిమగా
దర్ధాంగనారీఃపురా

* ప్రతాపరుద్రీయమునుండి.

సోఽయం సంప్రతి కాకతీశ్వరకులే
సర్వాంగ నారీస్థితః
స్థానే యద్విషమావలోకనకళా
మాత్రేణ భస్మీకృతా
న్యాసన్ వైరి పురాణి చిత్రమధునా
ఖడ్గేవిమంధార్యతే.

‡ శ్లో. కౌసల్యాపి ప్రథమ జననీ
దేవకీచ ద్వితీయా
విష్ణోర్మాతా, తదనుమహితా
ముమ్మడాంబా తృతీయా
యాస్త్రీతా యాం రఘుపతిరభూ
ద్యాపగే శౌరిరాసీ
త్రాతుంక్షోణిం స జయతి కలౌ
వీరరుద్రావతారః

మహారాజ్ఞీ! ఏమి యింత యాకస్మికముగ మమ్మువిడ నాడ దలచితిరి?

రుద్రమ:— గురుదేవా! మీకును విషాదమా!

విశ్వే:— మహాదేవీ! ఎట్లుకాకుండును? తల్లిని విడనాడి బిడ్డలు సుఖింపగలరా?

‡ ప్రతాపరుద్రీయమునుండి.

రుద్రమ:— గురుదేవా! మిగులఁగృతజ్ఞను. ఇంతవఱకును నాకు వజ్రకవచప్రాయములైన ధైర్యస్థైర్యములు లోపించి నందున నాహృదయము మిగుల దుర్బలమైపోయినది. ప్రతిజ్ఞాపాలన మొకవంకను, మనోదౌర్బల్య మొకవంకను బ్రేరేపించుటచేత నీమహాసామ్రాజ్యభారమును సమర్థులగు మీాపైనిడి విశ్రాంతిఁగొందఁగోరుచున్నాను.

విశ్వే:— ఇఁకేమనఁగలము! మహేశ్వరునియిష్టమేయిది కాఁబోలు!

రుద్రమ:— [ఆకసమువంకఁజూచి] స్వయంభూప్రభూ! ఏకవీరమాతా! కాకతీయవంశమును అతంద్రితులై రక్షించుచుంటిరి. మీాయనుగ్రహముచే నీమహాసామ్రాజ్యమున్నతస్థితిఁగాంచినది. బాలప్రతాపరుద్రునికి మీారే తోడునీడలై కాపాడెదరుగాక!—

[బాలునిఁజేరదీసికొని,] కుమారా! సుప్రసిద్ధ కాకతీయ ప్రభువతంసులచే బాలితమైన యీమహాసామ్రాజ్యమును జనరంజకముగఁ జిరకాలముపాలించి, చిరకీర్తియుతుఁడవగుదువుగాక. నీభుజావలంబనమునఁ గాకతీయ సామ్రాజ్యలక్ష్మి యనిదంపూర్వ మహోన్నతిఁజెంది వెలుఁగుఁగాక. నీయవక్రపరాక్రమము నీవిపక్షుల కెల్లఁ బరాభూతులగావించి, నీసార్వభౌమపదవి నన్వర్థముఁ జేయుఁగాక. పరమశైవుడవై, సర్వమతసమానసూత్ర

లంబివై, సర్వజనానురాగమునకుఁ బాత్రుడవగుదువు గాక.

గురుదేవా! నూతనసార్వభౌమునకు జయమగుఁగాక!

తాపసి! నీ కీర్తి,

* శ్లో॥ దృష్ట్వా కాకతి వీరరుద్రనృపతేః
కీర్తిం జగద్వ్యాపినీం
వస్తుం వాంఛతి శంభురత్రిసుతుం
లక్ష్మీస్సపత్నీ కాంక్షతి
స్నాతుం ధావతి దివ్యతాపసగణాః
సంవర్ధితుం వార్ధయా
శ్రేష్ఠం తే సలిలాసముద్రమురపి
స్ప్రష్టుంశ నైవహతే॥

విశ్వే:— ఈకుమారప్రభువు,—

* శ్లో॥ ఉద్దామోద్యత విక్రమే కృతయుగే
బాహూర్జయామూర్తేర్యథా
త్రేతాయాం రఘునాయకస్యమహిత
ఖ్యాతౌ భుజాయాంయథా

* ప్రతాపచరిత్రమునుండి.

దోర్దండే చ యుధిష్ఠిరస్య విలస-
చ్ఛౌర్యే యథా ద్వాపరే,
విస్రబ్ధాద్యకళౌ తదైవ రమతే
క్షోణ్యాంధ్రిభర్తుర్భుజే!

రుద్రమ:— మహాదేవరాజా! బాలరాజు యుక్తవయస్కుఁడగు వఱకు నీవు ప్రతినిధివై రాజ్యమును శాసింపుము.

మహాదే:— మహాదేవియాజ్ఞ!

వంది:— పరమేశ్వర, పరమమాహేశ్వర, పరమభట్టారక, కుమార శ్రీప్రతాపరుద్రసార్వభౌమునకు జయము.

రుద్రమ:— ఇక నాప్రస్థానమున కనుమతినిండు.

[చేతులు మోడ్చును.]

అందరు:— మహేశ్వరునియాజ్ఞ.

రుద్రమ:— [ఆకసమువంకఁ జూచి,] పరమేశ్వరా! జగద్రంగమున నాపాత్రము యథాశక్తిగ నటించి నాకర్తవ్యమును నిర్వహించితిని. ఇక విశ్రాంతికై నీపాదములాశ్రయింప వచ్చుచున్నాను. [స్థిరదృష్టితో మెల్లగా నడచును]

— పాట —

పూరికల్యాణి — రూపక.

భువనరంగంబుపైని - అస్మదీయజీవనటన
శంభో... ... ... ... ...భూతేశ ద్వంద్వజన్మ
పరిసమాప్తమయ్యెనిఁకుల. — ||భువన||
పరమునొసగరాదా-పరమపురుష-పరమేశ్వర ||భువన||

[ విశ్వేశ్వరభవ్య మున్నగువార్లు ప్రముఖులు రుద్రమదేవి ననుగమింతురు ]

— తెర —

సమాప్తము.



# — పాత్రవర్గము —

## పురుషులు

1. గణపతిదేవ సార్వభౌముడు = కాకతీయ చక్రవర్తి.
2. విశ్వేశ్వరశంభువు = రాజగురువు.
3. వీరభద్రేశ్వరుడు = నిడుదవోలు మహారాజు.
4. రుద్రమదేవుడు ★ = రుద్రమదేవి పురుష నేపథ్యము.
5. శివదేవయ్య = ప్రధానామాత్యుడు.
6. గన్నయామాత్యుడు = సర్వసేనాధిపతి.
7. సోమయామాత్యుడు = సహాయసేనాపతి.
8. గంగయదేవుడు }
9. సారంగపాణిదేవుడు } = సామంత ప్రభువులు.
10. గన్నయ్యారెడ్డి }
11. పేరినాయకుడు = పౌర ప్రముఖుడు.
12. వీరేశ్వరుడు = ముమ్మడమ్మ పితృవ్యపుత్రుడు
13. వంది
14. జైనగురువు
15. మహాదేవరాజు
16. భటులు, ద్వారి, జంగములు, బవినీలు, వీధి పాటకుడు మొదలగువారు.

## లు

1. రుద్రమదేవి ★ = గణపతిదేవుని కూతురు.
2. ముమ్మడమ్మ = రుద్రమదేవుని రాణి.
3. చెల్లాంబ = ముమ్మడమ్మ నర్మసఖి.
4. గౌరి }
5. ముత్యాలు } అంతఃపుర పరిచారికలు.

దాసీలు, చామర గ్రాహిణులు మొదలగువారు.

# ఆశీస్సు.

"సాహిత్యస్థాపక"
పండిత దుర్భా సుబ్రహ్మణ్యశర్మ.

నెల్లూరు,
16—1—46.

కథలోనే కొంత వింత, కొంత యుత్కంఠకొలుపు విషయము లునికి నిక్కమేయైనను, ఈ రచయితలు వానిందీర్చిన తెలుంగు ఔచిత్యమున కెసఁగుక కౌతుకము వర్ధిల్లఁజేయఁజాలియున్నది.

రుద్రమదేవి శీలము నిర్ఛిద్రముగాఁ బోషింపఁబడినది. ఆనాఁటి యాంధ్రదేశస్థితియుఁ గొండొక గోచరించుచున్నది. అనువదించుకొన్న శ్లోకములు, పద్యములు హృద్యములు అవియు నవసరమైనచోట్లనే నెలకొల్పఁబడియున్నవి. పాటలును గలవు.

ఈ రచనలోఁ దృష్టిపడక, ఈ యువకరచయితలు ఆంధ్రదేశపు ఔన్నత్యము వెల్వఱుపఁగల మరియొక యితివృత్త మేదియేని కొని, ఇంతకన్న విశిష్టసృష్టియు, సంవిధాన చమత్కృతియు, వెలయునట్లు దానిని నిర్వహింతురుగాకయని ప్రోత్సహించుచున్నాను.

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ.